గౌతమీ పుత్రి గ్రంథమాల :— 3

# ఉపాధ్యాయుడు.

( హాస్య ప్రధానము )

మునిమాణిక్యం
నరసింహారావు



తల్లావఝ్ఝలవారు
గుంటూరు

అర్ధరూపాయి

# ఉపాధ్యాయుడు.

మునిమాణిక్యం
నరసింహారావు

తల్లావఝ్ఝలవారు
— గుంటూరు —

## "మాస్టరీ" సంపాదన.

ఉపాధ్యాయుని జీవితం అందరు అనుకొన్నట్లు అంధకారయుతమైనది కాదనీ, బ్రతకలేక బడిచదువు చెప్పుకో అనే మాట నిజము కాదనీ, అనుభవించేవాడికి ఈ జీవితంకూడా హాస్యరసము ఇస్తుందనీ చెప్పటమే దీనియొక్క ముఖ్యోద్దేశము.

మా ప్రశ్నలకు కుర్రవాళ్లు ఇచ్చే జబాబులు, వాళ్లు చేసే అల్లరులు, రాసే రాతలు చూచి ఆనందించవలసినదేకాని చిత్రించటంమూలాన పాఠకులను రంజింపజేయ ప్రయత్నించుట దుర్ఘటమైనకార్యము. అయినా పూనుకొన్నాను. నేను ఎటువంటి ఉత్సాహపూరితమైన హృదయంతోను, కుతూహలంతోను వ్రాస్తున్నానో, అటువంటి హృదయాలతోనే పాఠకులు దీనిని చదువవలెను. కాని ఉన్నతాదర్శములు, ఉత్కృష్టప్రేమ, గంభీర భావములు, నీతిపాఠములు ఇవి ఉత్తమకావ్యలక్షణాలు అని అనుకొని వాటికోసం యీ వ్యాసంలో చూస్తే ఏమీ కనపించవు. అటువంటి ఉత్తమ విషయములు మీకు కావలెనంటే ఈ వ్యాసం చదువవద్దు.

కాసేపు మనసార నవ్వుదామనుకొంటే రండి, మంచో చెడ్డో, నవ్వటం ప్రధానం. చిరునవ్వు నవ్వినాసరే, కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వినాసరే, నాకైదెనా సంతోషమే. అది మీతత్వాన్ని అనుసరించిఉంటుంది. ధన్వంతరి సిద్ధాంతప్రకారం

బహుశః పిత్తకోశాన్ని ఆధారంచేసికొని ఉంటుంది. పైత్య తత్వం అయితే విరగబడి నవ్వుతారు. కొంచెం వాతంకూడా కలిసిఉంటే చిరునవ్వునవ్వుతారు. నలభైఏండ్లు దాటినవాళ్లకు ఈ పుస్తకం చదవటానికి అర్హతలేదు. వాళ్లకు పైత్యం బొత్తుగా నశించి నాడి వాతంమీద హంసనడకలాగ నడుస్తుంది. అట్టివారికి నవ్వురాదు.

ఇంగ్లీషుభాషలో జెరొం, జేకొబు, కెశిన్, హశావర్డు, వుడ్‌హౌస్, క్రాఫోర్డు, ఎన్‌టుసే మొదలైన సుప్రసిద్ధ హాసికుల పుస్తకాలతో పరిచయం ఉన్నవాళ్లకు ఈవ్యాసం కొంచెం రుచిస్తుంది.

ఆదిలో నిరృతి, ధనలక్ష్మి అని ఇద్దరు అక్కచెల్లెండ్రు ఉండేవారు. ధనలక్ష్మికుమారులు వర్తకంవ్యాపారము, వాజ్యాలు నడపటం మొదలైన పనులు చేసి ధనవంతులైనారు. నిరృతి కుమారులు బడిచదువు చెప్పుకొని బీదలైనారు. బీదలైన ఉపాధ్యాయులు నిర్విశేషజీవనమైన నిర్వృత్తికి నిర్వాణానికి అడ్డులేనిదైన మనుగడ అనుభవిస్తున్నారు.

అట్టి నిష్కలుషమైన జీవనము ఇంత నిసారవము త్రాగి జీవిస్తేనేమని నిశ్చయించుకొని దానికై అన్వేషణ ప్రారంభించినాను. కావలెను అన్న చోటకల్లా నా కాగితముపంపినాను. నేను పంపిన విన్నపములు హూణ విద్యార్థులకు చెప్పిన విద్యలాగ, అగ్నిలో పోసిన ఆజ్యంలాగ నామరూపాలు లేకుండా పోయేవి.

పెద్దవాడ ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయుడు కావలెనని విని ఆ వూరు ప్రయాణం కట్టాను. దరకాస్తుపంపితే లాభంలేదని స్వయంగా ఆ పాఠశాలాధికారులను చూచుటకు నిశ్చయించుకొన్నాను.

దరఖాస్తు వ్రాసి పెట్టెలోపెట్టుకొని కావలసిన బట్టలు తీసికొని ఇల్లుబయలుదేరి రెండడుగులు వేసేసరికి పిల్లి ఎదురుగా వచ్చింది. దాన్ని నాలుగు తిట్టి, తిరిగి ఇంటికిపోయి, అరుగు మీద కూర్చుని, కాళ్ళు కడుక్కొని రెండు బియ్యపుగింజలు నమిలి, మా అమ్మాయినే నాకెదురుగా రమ్మని ముందుపంపాను. ఈతఫా కన్యముత్తైదువు ఎదురుగా వచ్చిందని సంతోషించి బయలుదేరినాను. కాకి ఒకటి ఎడమవైపునుంచి కుడి వైపునకు పారటంవల్ల శుభశకునాలు ద్విగుణంగా వచ్చినవని సంతోషించి రైలెక్కి పెద్దవాడ చేరాను.

ఆయన ఇల్లు పెద్దబజారులో ఉంది. పెద్ద అరుగులఇల్లు. ఆ అధికారి వైశ్యకుల వయోవృద్ధు. అందుచే నమస్కరించాను. ఆయన ఆజ్ఞను అనుసరించి ఒక ధూళిధూసరితమైన కుర్చీలో కూర్చున్నాను. మాఇద్దరికి సంభాషణ ఇల్లా జరిగింది. ఆయన నావంక దేరిపారజూచి,

'మీ దేవూరండి?'

'తిరువూరు.'

'ఎందు కొచ్చారు?'

‘ తమ పాఠశాలలో పనిచేయటానికి ఒక బి. ఎ. కావలయునని విని తమను చూడటానికి స్వయంగా వచ్చినాను. ’

ఈ మాటలో ఏముందోకాని ఆయన చిరునవ్వు నవ్వి పక్కనున్న మరొక వైశ్య ప్రముఖునివంక చూశాడు. చూశావా? ఎంతమంది వస్తున్నారో ఈ ఉద్యోగంకోసం.— అనే అర్థం ఆచూపులోవుంది. మళ్ళీ ఆయన నావంక చూచి,

“ తమరు గ్యాడ్యుయేట్లేనా ”

“ మొన్నే బి. ఏ. ప్యాసుఅయినానండి. ”

“ అంటే, గ్యాడ్యుయేటన్నమాటేనా? ఏమైనా భేదం ఉందాఅండి. ”

“ ఏమీ లేదండి నేను గ్రాడ్యుయేట్నునే ”

“ సరె మాకో గ్యాడ్యేటు కావాలని పెద్దమాస్టరు గారు చెప్పారు. మీయూరికి ఈవూరు చాలాదూరముకదా. ఇక్కడ ఉంటారా? ఈమధ్య ఒకాయిన ఇట్లాగేవుంటానని ఆర్డరు పుచ్చుకొని చెప్పకుండా వెళ్లిపోయినాడులెండి. దాని తరువాత విచారిస్తే వాళ్ల ఊరిదగ్గరే ఏదో వుద్యోగం దొరికిందని తెలిసింది. ”

“ మీకు అటువంటి భయం వుండనక్కరలేదు. ఎక్కడుంటే అదే నాకు స్వగ్రామము. పొలమూ బాట్రీ లేని

వాళ్లకు ఎక్కడ పొట్టగడిస్తే అదే స్వదేశం" అని కొంచెం దీనంగా మాట్లాడినాను.

ఆయనకు నాయందు అభిమానం కలిగినట్లుంది. ఎందు చేతనంటే నన్ను హెడ్‌మాష్టరును చూచిరండని అన్నాడు.

ఆ హెడ్‌మాష్టరుగారు నాకు బాల్యంలో గురువు. ఆయన నావిషయంలో ఏవిధమైన అడ్డూ పెట్టక, 'రేపు తప్పక వెళ్లిచూడు. నేనుకూడా నీకు చేయదగిన సాయము చేస్తా' నన్నాడు. మహానుభావుడు. అట్టి సహృదయుడు వందనీయుడు

మర్నాడు ఆయనను చూడటానికి బయలుదేరినాను. తెల్లమల్లు కట్టాను. పాప్లినుచొక్కా, సిల్కుకోటు వేసుకున్నాను. కొంచెము డాబుగా వుండాలని నా ఉద్దేశం.

నన్ను ఒంటిగంటకు సరిగ్గా రమ్మన్నాడు. నేను సరిగ్గా ఆవేళకు పోయేసరికి ఆయన నిద్రలో వున్నాడు. ఏమి చేసేది ? అక్కడే కుర్చీలో కూర్చున్నా. రెండైంది, మూడైంది, ఆయన రాలేదు. ఎండకాలం కావటంచేత నోరెండిపోతున్నది. బైటికి వెళ్లి ఇన్ని సోడానీళ్లు తాగివద్దామాఅంటే, తీరా నేను కాలు బయట పెట్టేసరికి ఆయన వచ్చి నేను రాలేదనుకొని వెళ్లిపోతాడేమో అని భయం. అట్లాగే అక్కడ అయిదు గంటల వరకు కూర్చున్నాను. అప్పటికి ఆయన దర్శనం అయినది.

"మీరు వచ్చి ఎంతసేపైందండి ?"

"ఒంటిగంటకే వచ్చానండి"

" మీ కా సెల్లూరు ఆయన కనపడ్డాడా ? "

" ఎవరండి ఆయన ? "

" మీకు తెలియదా ? యమ్. ఏ. ప్యాసు అయినాడట. మిమ్మలను ఎరుగట. ఎక్కడో కలిసి చదువుకొన్నారట. "

" ఎరగనండి "

" పొడుగుగా, బక్కబల్చగా, చామనచాయన వుంటాడండి. మిమ్మను బాగా ఎరుగుదునన్నాడు "

" కావచ్చు. నా కేమాత్రము జ్ఞాపకంలేదు. అయితే ఎందుకొచ్చాడండి ? "

" మీ మోస్తరుగనే ఉద్యోగానికే వచ్చాడు. చాలా ఇబ్బందిగావుంది. జీతం ఏమిఇచ్చినా పుచ్చుకుంటానండి అని ఎంతో ప్రాధేయపడ్డాడు. కాని మిమ్మలను అడగంది నేను మాట ఇయ్యనని పంపాను. సాయంత్రం వస్తానన్నాడు. ఇంకా కాసేపటికి వస్తాడు అనుకొంటా. లేకపోతే బైట కూర్చున్నాడో. ముందు మీరు వచ్చారు. మీరు వద్దంటేనే ఇంకోరి కియ్యటం "

ఆహా ! ఎంత విశ్వాసపాత్రుడు ఈయన, అని నాకు సంతోషం కలిగింది. అందుకని అన్నాను—

" అయ్యా, మీరు ధర్మం ఆలోచించారు. నేను మిక్కిలి అవసరంలోవున్నా. నాకు దయచేసి ఆర్డరు ఇయ్యండి. "

" ఇయ్యటానికి అభ్యంతరములేదు. మీకు మాకు జీతం దగ్గరే కుదరాలె. "

శ్రీ శేషు గ్రంథాలయము, వేటపాలెం

"ఏం తంటారు?."

"మీకు ముందుగానే మనవిచేస్తున్నా. మాస్కూలులో జీతాలు తక్కువ. అదైనా తొమ్మిదినెలలకే ఇస్తాము. మీయిష్టమైతేనే రండి, లేనిచో వెళ్లండి. క్రిందటిసంవత్సరం వెళ్లిపోయిన గ్యాడ్యేటుకు 28 ఇచ్చేవాళ్లం. ఆయనచాలా అనుభవం కలవాడు. నవ్వుతారేమి! నామాటయందు నమ్మకం లేకపోతే సుబ్బరావుగారిని కనుక్కోండి. ఆయనకు బంధువుడే ఆయన. ఈ నెల్లూరు ఆయన ముప్ఫై ఇయ్యమంటున్నాడు. మీకు అనుభవమాలేదు. M. A. అయినాకాదు. ఏమియ్యమంటారు?"

ప్రిభూ! బి. ఏ. కు ఎంత విలువ వుందో నాకు బోధపడ్డది. ప్రాణం చల్లబడ్డది. గుండె బిగుసుకుపోయింది. నోట మాట రాలేదు. నేను అంత తక్కువకు ఒప్పుకోకపోతే M. A. సిద్ధంగా వున్నాడు. ఇంకోచోట ఇంతకంటె ఎక్కువవస్తుందని నమ్మకం ఎల్లాగ? అని ఆలోచిస్తూ వుండంగానే, ఎవరో కుర్రవాడు వచ్చి నెల్లూరు ఆయన వచ్చాడు అని చెప్పాడు. ఇంకే ముంది ఈవుద్యోగం వాడు లటిక్కన వేసుకెళ్లటానికి సిద్ధంగా వున్నాడు. అధికారి నావంకచూచి నవ్వాడు, "ఏమంటావు పోతున్నది బేరం. నీయిష్టం" అన్నట్లు. నేనూ ఆయనవంక దీనంగా చూస్తూ "నల్భై అయినా యిప్పించండి" అన్నాను. ఆయన ఒక చిరునవ్వునవ్వి "అబ్బో! ఎంత అడిగావు! మాకు అందికలో లేదే! ఇక లాభంలేదు! బేరం కుదరదు" అని మాటల తర్జుమాలో అర్థంవచ్చే చూపులు చూశాడు.

నేను 'ఇక లాభంలేదు. పరుగెత్తి పాలు త్రాగేకంటె నుంచుని నీళ్లు త్రాగటం మేలు' అని అనుకొని, సరే మ్యూఫై అయిదయినా నాకు ఇప్పించండి అని అన్నాను.

,,మ్యూప్పై ఇస్తే ఆయనేవస్తాడు. నామాట అబద్ధం అయితే ఆయనను పిలిచి మీ యెదటనే మాట్లాడించ మంటా రా? అన్నాడు. ,,ఎబ్బే మీమాటయందు నమ్మకం లేకకాదు. దయచేసి నే నడిగింది ఇయ్యండి"

,,అవంతా వట్టిమాట. పూర్వము వలెనే 28 ఇస్తాను. మీ ఇష్టమైతే చెప్పండి. ఇర్వై ఎనిమిదికి సరే అంటే ఇప్పుడే ఆర్డరు ఇస్తాను."

ఏమిచేసేది ,,సరే మ్యూఫై అయినా ఇయ్యండి"అన్నాను. ఆయన చిరునవ్వు నవ్వి ,,మీరు అదృష్టవంతులు పెద్దమాస్టరు గారు కూడా మీవిషయమై చెప్పారు. మీరు అభిమానంగా పనిచేస్తారనే నమ్మకంతో మీకు ఆర్డరు ఇస్తున్నాను" అని ,,ఒరేయి, వీరి అప్లికేషను తీసికెళ్ళిచ్చి ఆర్డరు టైపుకొట్టమను గుమాస్తాతో. ఆనెల్లూరు ఆయనతో రేపు రమ్మని చెప్పు" అని అన్నాడు.

,,ఆర్డరు వస్తుంది తీసుకపొండి. మీరు మాస్కూలు పాత విద్యార్థులుకూడాను. విశ్వాసంగా పనిచేయాలె. అయితే నాకో సందేహంవుంది. అడుగుతాను కోపంలేదుగదా" అన్నాడు ఆయన. ,,నేను చిన్నవాడిని తమరు పెద్దలు. మీమీద నాకు కోప మేమిటి? దయచేసి చెప్పండి మీసందేహమేమిటో" అన్నాను.

,,ఏమిలేదండీ, మాస్కూలులో కొంచెం అల్లరికుర్రి వాళ్ళు వున్నారు. చూడబోతే మీదగ్గర సదరు తక్కువ. చెప్పగల ధైర్యం వుందా? అని అన్నాడు ఆయన. మల్లుబట్ట పాప్లీనుచొక్కా సిల్కుకోటు వేసికొన్నా సదరు తక్కువ గాబోలు ఆయనకళ్ళల్లో. అయినా నీళ్ళు నమలితే లాభం లేదని ,,అయ్యా ఒక్కమాట చెబుతాను వినండి. సదరు మటుకు తక్కువేకాని చెప్పటం సిసలుగా వుంటుం"దని అన్నా. వర్తకశిఖామణి హృదయానికి ఈమాటలు టంకంపొడిలాగ అతికినవి. వుత్తరక్షణంలో ఆర్డరుతెచ్చి నాచేతి కిచ్చి చిరునవ్వుతో అదృష్టవంతుడివిసుమా, అన్నాడు.

అప్పుడు నాకు ఆయనను చూస్తేకలిగినరోత నాకొకసారి మదాసులో మూర్ మార్కెటులో ఒక షాపువానిపై పుట్టిన ఏహ్యాభావంతో తులతూగుతుంది. నేనూ మరియొక పెద్ద మనిషి ఆమార్కెటుకు పోయి కొన్నివస్తువులు బేరంచేశాము. ఏవోకొన్ని చిన్నవస్తువులు కొన్నాము. తరువాత ఒక పెద్ద పౌంటెన్ కలము బేరము చేశాము. అది చూపులకు చాలా డాబుగావుంది. పైకి పాతిక రూపాయల కలంలాగ వుందికాని దానిఖరీదు అంత వుండదని మాకు తెలుసు. కాని ఎంతో నిశ్చయించి చెప్పలేము. అతడు పదిరూపాయలు చెప్పాడు. చివరకు మూడున్నరకు ఫైసలుచేసి కొన్నాను. ఈవ్యవహార మంతా దీక్షతో గమనిస్తున్న ప్రక్క షాపువాడు మేము పోతుంటె మావంక నవ్వుతూచూచి you are lucky అన్నాడు.

అసలు ఆకలం అర్ధరూపాయ ఖరీదు. అందుకని మమ్ము
లను వేళాకోళానికి వాడు అల్లా అన్నాడని దాని తరువాత
తెలిసింది.

ఈ స్కూలు అధికారి అంతే. నెల్లూరు ఆయన కేవ
లము కల్పిత పురుషుడు. అట్లా ఒక యమ్. ఏ. ను సృష్టించి
బేరాలు తగ్గించటం ఆయనకు సహజమైన వ్యాపారమని తరు
వాత నాకు స్నేహితులు చెప్పినారు. ఎట్లాగయితేనేమి
ఆ స్కూలులో ఉద్యోగం దొరికింది.

# 2

## ఉరుములు - మెరుపులు.

నేను ఉపాధ్యాయుడుగా పాఠశాలకు వెళ్లిన మొదటి రోజు నా సమస్తజీవనంలో పండుగదినము. అంతవరకును స్వేచ్ఛగా తిరిగినాను. నావచ్చినతోవ నిష్కంటకమైనది. నేను గడపిన మనుగడ నిష్కలంకమైనది. నాజీవితము మృదుమధుర సుమశయ్యయేకాని, కఠినభూతలముకాదు. తలవంపులెరుగను. తంత్రము లెరుగను. మాయలెరుగను.

ఆరోజు— ఏమి మార్పు నాజీవితంలో విద్యార్థిగా బల్లపైన కూర్చుండేవాడిని కుర్చీలో కూర్చునే రోజు. విద్యార్థిగా నున్నపుడు ఉల్లాసంగా పాఠశాలకు పోయేవాడిని. ఆరోజు ఏదో చెప్పలేని భయము నన్ను పట్టుకొన్నది. కొంత క్రొత్త, కొంత భిడియము, కొంత సిగ్గు, కొంతభయము నన్ను ఆవరించుకొన్నవి.

మా అధికారి సదరు విషయమై నొక్కి చెప్పటం మూలాన నా దుస్తుల విషయమై పడవలసిన జాగ్రత పడ్డాను. కట్టుపంచ మొదలుకొని శిరోధారణవరకు సలక్షణంగాను శాస్త్రనిబంధనానుకూలంగాను ప్రవర్తించాను. ఇంత జాగ్రత్తగా ముస్తాబు చేసికొని నా బాలురతో ప్రథమ పరిచయం చేసుకొంటానికి బయలుదేరినాను. నా బాలురను చూడవలెనని నేనెంత తహతహ పడుతున్నానో క్రొత్తమాస్టరును చూడాలని వాళ్లూ అంత వేగిర పడుతున్నారు.

నేను అయిదవ ఫారంలోకి పోవాలని తెలిసింది. ప్రిప్రిథ మునసే పెద్దక్లాసుకు పోవలసి వచ్చిందే అని మనస్సులో అనుకొని, ఒక విధమైన సంతోషంతో మేడ మెట్లెక్కి క్లాసులోకి పోయినాను. నేను పోయినాను అనటం ఒక శబ్దాలంకారం అనాలె. ఎందుకంటె పోయింది నేను కాదు. నా కాళ్లు.

కుర్చీలో కూర్చునే పర్యంతము చీమ చిటుక్కుమన్నా విని పించేటంతటి నిశ్శబ్దంగా ఉంది. కూర్చునేసరికి నాకు పరమానం దం కలిగింది. బ్రిటీషురాజ్యాన్ని ఏలే చక్రివర్తి సింహాసనం మీాద కూర్చున్నపుడు ఆయనకు గలిగే ఆనందం నాకు కలిగిన సంతోషం ముందు తృణసమానము. జయసూచకంగా ఒక్క చిరునవ్వు నవ్వినాను. ఉత్తర క్షణంలో పిల్లలందరు ఒక్క మారు బెంచీలమీాద ధమధమా అని వాయించినారు. ప్రళ యకాల సూచనార్థమైన పిడుగువలె ఆ శబ్దము నాగుండెలలో మారుమ్రోగింది. ఆ చిన్ని చిరునవ్వు మెరుపుకు ఇన్ని ఉరుములా ! నా లోపము ఎక్కడుందో నేనూహించలేక పోయినాను.

సాక్రిటీసుపడ్డ అవస్థలో పడ్డాను. సోక్రిటీసుకు రక్కసి భార్య ఉండెడిది. ఒకరోజు ఆయన రావటంతోనే ఆమె తర్జన గర్జన భర్జనాది దార్జన్యాలతో ఆయనకు స్వాగతమిచ్చి అంతటి తో కోపాగ్ని చల్లారక పోవటం మూలాన కుండెడు చన్నీళ్లు తీసికొనివచ్చి ఆయన నెత్తిన పోసిందట. పాపము ఆయనకు ఎందుకు అట్లు చేస్తున్నదో తెలియదు. ఆయన నవ్వుతూ

ఆ ఉరుములకు ఈ కొద్దివర్షమేనా అని అన్నాడట. నవ్వే శక్తి ఉంటే ఎట్టి అవమానాన్ని అయినా అట్లా నవ్వేసి వేయవచ్చు.

నాకు అల్లాటి అవస్థేవచ్చింది. అందుకని నేనూ, ఆ చిన్న మెరుపుకు ఇంత పెద్ద ఉరుమా అన్నా. సాక్రిటీసుభార్య ఏం జేసిందో తెలియదు. కాని మా కుర్రవాళ్లుమటుకు మళ్ళా బల్లలు కొట్టారు.

ఏమి చెయ్యాలిసింది తోచిందికాదు. ఉపాధ్యాయ ప్రముఖులు ఏమిచేశారు అట్టి పరిస్థితులలో. చూడండి. ఒక ఆయన ఆస్ట్రేలియా భూగోళజ్ఞానము బోధిస్తూ ఒక సందర్భంలో Stamping is done in Australia అని చెపటం ప్రారంభించేసరికి పిల్లలు ఆ మాటవిని అర్థం అందుకొని గబగబ బల్లలు కొట్టారు. ఉపాధ్యాయుడు కొంచెముసేపు నిదానించి by asses అని అన్నాడట.

అటువంటి ప్రయోగము ఏదైన ప్రయోగిద్దామంటే ఏమీ తోచక పోవటమేకాక కాళ్లు తేలిపోవటం మొదలుపెట్టినవి. సాధ్యమైనంతవరకు గాంభీర్యాన్ని కళల్లో నిలువబెట్టి ఇంగ్లీషులో ,, నాకు చాలా విచారంగా ఉంది " అనేసరికి అందరు ఏకగ్రీవంగా ,, చోచ్చోచ్చోచ్చోచ్చో " అని సానుభూతిని వెలిపుచ్చారు. ఇంతకంటె దీనావస్థ ఇంకేముంది ?

ఏమితోచక ఒకవిధమైన దురవస్థలోపడి నేను కొట్టుకుంటుంటే ఇంతలో ఒక పెద్దకుర్రాడు లేచినాడు. మీసకట్టు ఒక మోస్తరుగా అగుపించింది. స్ఫురద్రూపి. కాలు పొడుగాటివాడు. వాడిని చూచేసరికే నాహృదయంలో ఎట్టి చలనం కలిగిందో

కాని ముఖం కళా విహీనం అయిపోయి ఆముదము త్రాగిన వాడి ముఖంలాగ వికారరూపం పొందినదని మాత్రం నాకు తెలుసును.

ఆ కుర్రవాడు నా ముఖంవంక తేరపారచూచి, చప్పున క్లాసులోనుండి బైటకు పోవడం మొదలుపెట్టాడు. "ఏమోయి! ఆగు. అల్లా పోవటమే? ఇక్కడున్న ఉపాధ్యాయుడి అనుమతి లేకుండానే? ఇదేమి విపరీతము?" అన్నాను నేను. ఆకుర్రాడు నదురు బెదురు లేకుండా "ఇది పెద్ద క్లాసండి" అని ఠీవిగా నడచి పోయినాడు.

ఒక్క చిరునవ్వు నవ్వి అప్పటికి తప్పించుకొన్నాను. ఇంక ఏదోఒక దౌర్జన్యం చేయకపోతే పిల్లలు హద్దుమీరి అల్లరి సాగించేలాగున్నారు. వాళ్ల పాఠము చెపటం మొదలు పెడదామంటే అది ఏమో నాకు తెలియదు. అడిగితే సక్రమంగాను వినయంగాను చెప్పే స్థితిలో వాళ్ళు ఏమాత్రంలేరు. వాతావరణస్థితి ప్రమాదకరంగా ఉంది.

ఇవన్ని అవగాహనం చేసికొని అమాంతంగా ఒక ఉపన్యాసము ఎత్తుకొని పెద్దపెద్ద మాటలు నోటినిండా పలుకుతూ, తడువుకోకుండా ఒక్కదమ్మున గంటకొట్టే పర్యంతరం బిపిన్ చంద్రపాల్‌లాగ ఉపన్యాసము కురిపించాను. కొండవీటి జలాపాతమువలె వచ్చే ఈ వాగ్ధోరణిచూచి మావాళ్ళు చల్లబడ్డారు. ముఖాలు వికసించినవి. కొత్తమాస్టరు గట్టివాడని మనస్సుకు నచ్చింది. నేనూ గండంతప్పి బైట పడ్డందుకు సంతోషించాను. ఆ సంవత్సరానికి ఆ క్లాసులో అల్లరిలేదు.

---

15

# 3

## శిష్యస్మృతి.

మొదటిరోజున నన్ను కొంచెము ఒత్తిచూచి ఉపాధ్యాయుని సత్తువ గ్రహించినారు. తరువాత వారము రోజులు నేను పాఠం చెప్పలేదు. ప్రతిదినము ఏదోయొక విషయమై గంభీరమైన ఉపన్యాసము ఇయ్యటంవల్ల వాళ్ళకు నాయందు కలిగిన ఉద్దేశాన్ని స్థిరపరచాను. ఆవిధంగా నా కష్టాలు గట్టెక్కినవి. కుర్రవాళ్లు నన్ను అర్థంచేసుకొన్నారు. నేనూ వాళ్ళ గుణగతాలు గ్రహించాను. మాయిద్దరిమధ్య కోపద్వేషాలు నశించి పోయి కాలము హాయిగా గడవటం మొదలుపెట్టినది.

అయితే ప్రతి సంస్థకూ, జాతికీ, బృందానికీ ఎల్లాగయితే కొన్ని హక్కులు ఉంటవో అల్లాగే విద్యార్థిబృందానికికూడా కొన్నిజన్మహక్కులున్నవి. మార్కులు బాగావేయాలె. పరీక్షపత్రాలు కఠినంగా ఉండరాదు. ఇవి ముఖ్యమైనవి.

ఇవిగాక మరికొన్ని నిబంధనలున్నవి. పరీక్షలో కాపీ చేస్తుంటే ఉపాధ్యాయుడుచూచీ చూడనట్లు ఊరుకొని గుమ్మం దగ్గర నుంచుని పేపరు చదువుకొంటున్నట్లు నటిస్తూ పెద్ద మాస్టరు బెత్తంతీసుకొని రానటం కుర్రవాళ్ళకు తెలియపరచాలె. కుర్రవాడు ఆలస్యంగావచ్చినా, ఎప్పుడైనా ప్రమాదవశంచేత పాఠశాలకు రాకపోయినా ఉపాధ్యాయుడు గమనించరాదు. ఇటువంటివి అనేకంగా ఉన్నవి. వారి న్యాయచట్టము అంతా వివరంగా వ్రాస్తే ఈ చిన్నపుస్తకంచాలదు.

ఈ చట్టాలలో శిక్షాస్మృతిలోని ఒకటి రెండు విషయా లనుమాత్రం ఇచ్చట మచ్చుకు చూపిస్తున్నాను. ఏ ఉపాధ్యా యుడైనా వ్రాయబడిన ఉత్తరములు లేక జవాబులు చూచి తక్కువ మార్కులు వేసినా, విద్యార్థి అనుకొనినన్ని మార్కు లు వేయకపోయినా, వేసిదిద్దినా, దిద్దినట్లు అనుమానమున్నా, పత్రంమీదవేసి పెద్దపుస్తకంలో వేయకపోయినా శిక్షార్హుడు.

పైనచెప్పిన తప్పులకు రెండువిధములైన శిక్షలున్నవి. ఒకటి సామాన్యశిక్ష, రెండవది కఠినశిక్ష. బాలురే తప్పిదమునుబట్టి శిక్ష నిర్ణయించవచ్చును. శిక్షితుడైన ఉపాధ్యాయుడు. రాళ్లు రువ్వుట, అతని పుస్తకములను తస్కరించి దహనముచేయుట, అతనిపేరు నిందావాక్యములతో సంఘటనముచేసి గోడలపైన వ్రాయుట, అతని కేదైన విపరీతమైన పేరు పెట్టుట, క్లాసులో ఒకరుకాని, అందరుకాని అతనిని ఎదిరించుట మొదలైన తిర స్కృతులకు లోనగును. పిల్లవాళ్ళు సూక్ష్మబుద్ధి గలవాళ్ళయితే ఇంకను విచిత్రమైన తిరస్కృతులను కనిపెట్టి అట్టి శిక్షార్హు డైన ఉపాధ్యాయునిపై ప్రయోగించవచ్చును.

ఈ శిక్షాస్మృతిలో కఠినశిక్షకు అర్థం దండతాడనమే. క్లాసు లోని పిల్లలలో ప్రత్యేక వ్యక్తిగాని లేక అందరు కలసిగాని సక్రమమైనటువంటియు, ఉత్తమమైనటువంటియు మార్గము ననుసరించి పనిజరుపవలెను అని ఈ విధముగా వివిధనేరములకు విచిత్రమైన శిక్షలు శాసింపబడియున్నవి.

ఇట్టి చట్టములకు ప్రతి ఉపాధ్యాయుడు లోబడియుండాలని చెప్పటమే ఈ ప్రకరణం వ్రాయటంలో నా ఉద్దేశం. అట్లు

లో ..డక చట్టతిరస్కారముచేసిన ఉపాధ్యాయులు అనుభవించ వ.. .నదంతా అ.. భవించారు.

బంగారయ్యగారు మార్కులు వేయలేదట! రాత్రివేళ కొందరు కొంటెపిల్లలు ఆయన ఇంటికిపోయి, ఆయనను బయటి పిలిచి కొట్టదల్చుకొన్నారు. కాని పిలిస్తే ఆయన బైటికెందుకొస్తాడు? అందుకని ఒక ఉపాయం ఆలోచించారు. బంగారయ్యగారి బావమరది బందరులోనున్నాడు. ఆయన వ్రాసినట్లుగా ఒక వుత్తరంవ్రాసి, అందులో అతడు రాత్రి బండికి వస్తాడన్నట్లుగా వ్రాశారు. పాపము ఆ రాత్రి బంగారయ్యగారు బావమరది వస్తాడని అనుకొంటూ వుండంగానే "ఒరే బంగారూ" అని ఎవరో అస్పష్టంగా పిలిచారు. కుర్రవాళ్లకు చదువు చెబుతున్న బంగారయ్యగారు "మీ అన్నయ్య వచ్చేడేవు" అని గదిలోకి కేకేసి చప్పున తలుపు తీశాడు. పిలిచిన దెవరో చూచి గ్రహించకపూర్వమే నెత్తిమీద గుద్దపడ్డది. ధడిపెడి దెబ్బలు పడ్డవి. ఇంతలో అక్కమ్మగారు పొంగిపోతున్న సంతోషంతో చెంబుతో నీళ్లుతీసికొని లాంతరుతో 'అన్నయా' అంటూ వచ్చింది. ఆమె రావటంతోనే కుర్రవాళ్లు ఎక్కడివాళ్లక్కడ పారిపోవటంచూచి గాభరాపడి 'అయ్యో, ఇదేమిటి, ఇదేమిటి' అని అన్నది. దూరాననుంచి ఒకడు ఏమిలేదూ అమ్మాయీ, బావగారితో —

ఇది కక్షసాధకక్రింద ఉదాహరణము.

సుబ్బారావుగారు పరీక్షలో కాపిచేస్తున్న కుర్రవాడిని కొట్టినందుకు అతనికి "డబ్బా" అని పేరుపెట్టారు. ఆ నామము

గోడలపైన వ్రాయటమేకాకుండా, ఊళ్ళో అన్ని భాగములలో ఉండే ప్రజలకు వెల్లడి అయ్యేనిమిత్తం స్వేచ్ఛావిహారం చేసే ఆబోతుపై వ్రాయబడి బస్తీకి పక్షాలకు ప్రకటింపబడ్డది. ఆయన భార్య "పాలడబ్బా తేవాలండి" అని అంటానికికూడా భయపడేది. ఇది సామాన్యశిక్షకు తార్కాణము.

ఇట్లా శిక్షాస్మృతి ఘోషిస్తుంటే ఏ ఉపాధ్యాయుడు చట్టము నెదిరించి ప్రవర్తించగలడు? నేను క్రొత్తగా ఉపాధ్యాయవృత్తిలో ప్రవేశించాననికాబోలు, ఒక పెద్దమనిషి నాపైన కరుణపూని స్కూలుకు వచ్చి నన్ను పిలిచి "చూడండి, మీరు క్రొత్తగా వచ్చినట్లున్నారు. మాపిల్లలంతా మీ క్లాసులో నున్నారు. మార్కుల విషయంలోను, పరీక్షసమయంలోను కాస్త కనిపెట్టి వుండండి. మీకు విశేషించి చెప్పనక్కరలేదు. బంగారయ్యగారు, సుబ్బారావుగారు మొదలైన ప్రసిద్ధోపాధ్యాయులు అంతా ఈ పాఠశాలలో పాఠాలు నేర్చుకొని పోయినారే" అన్నాడు. ఆయన చెప్పినమాటలు మంచివే కాని, కోళ్లబుట్టంత కాళ్ళపును, చింత నిప్పులలాగ భయంకరమైన కళ్ళునూ ఉండి కొంతమందిచేత రౌడీ యని పిలువబడే పెద్దమనిషి యీ చిన్నవాడితో అవిధంగా మాట్లాడుతుంటే–నా ప్రాణాలు ఎక్కడున్నవో కనుక్కోండి.

జీవితమంతా ఉపాధ్యాయవృత్తిలో గడిపినవారిని అడిగితే ఇట్టి శిక్షలను తాము అనుభవించామనే వారు చెబుతారు. వెంకటప్పయ్యగారనే ఒక ఉపాధ్యాయుని దినచర్య తీయండి. ఎట్టి విచిత్రానుభవాన్ని గురించి వ్రాసినారో! ఈ పుస్తకంలో

ప్రవేశించటానికి అనుజ్ఞ యిచ్చినందులకు వారికి వందనశత ములు అర్పిస్తూ వారు వ్రాసిన విషయము యిక్కడ చేరుస్తున్నాను.

పాఠశాలాంతర పరీక్షకు నేను పదిమంది కుర్రవాళ్ళను పంప లేదన్న కోపంతో బయలుదేరింది కుర్రవాళ్ళకూ నాకూ చెడ్డ వ్యవహారం. పరీక్షసమయంలో కొంచెము కఠినంగా ఉండటం దానికి తోడైనది.

ఈ రోజు పాఠశాలాధికారి మా పాఠశాలను చూచి గోడల పైన వ్రాతలున్నవని, పిల్లలు అదుపు ఆజ్ఞలలో ఉండనట్లు తోస్తుందని అభిప్రాయం వెలిపుచ్చగా, నేను ఆ అభిప్రాయాన్ని పోగొట్టేందుకు ఏమేమో చెప్పి కుర్రవాళ్ళు చాలా మంచివాళ్ళే, కొద్దిమందిమాత్రం అల్లరివాళ్ళున్నారు. వాళ్ళయినా నన్ను జూస్తే వాడలుతూనే ఉంటారు. నా కనుమరుగున ఈపనులు జరుగుతూ ఉంటవి. తప్పుజేసినవాడు నాకంట బడితే బతకడు' అని చెప్పి అధికారిని ఒక విధంగా నమ్మించి, నా గౌరవాన్ని కాపాడుకొన్నాను.

' సాయంత్రం జడ్జీగారింటికి టీకి వెళ్ళి కనుచీకటిపడ్డతరువాత జట్కాబండిలో వస్తున్నాము. గేటుదాటి నాలుగడుగులు రావటంతోనే, ఎవరో ఇద్దరు ముగ్గురు వెనుకనుంచి బండి ఆపుమని కేకేశారు. ఎవరో ఆపుమంటున్నారని బండివాడు బండిని నిలుపుచేశాడు. ఇంతలో పదిమంది కుర్రవాళ్ళు బండిదగ్గర కొచ్చి తొంగిచూచి ,, ఒకేయి, మన టప్పాయేరా! ఎవరో అనుకొన్నాము. టప్పాయినప్పుడు, ఇసపెట్టిపోనీరా" అని

అన్నారు. అంతటితో ఊరుకోవచ్చునా! వాళ్ళ అగడంమండా "ఇనుము + పెట్టె = ఇనపెట్టా అని ఏసూత్రం ప్రకారం అయిందిరా?" అన్నారు. అది కర్మధారయ సమాసంరా అని వాళ్ళు దూరాన్నుంచి అనుకోటంకూడా మాకు వినిపించింది. ఇన్‌స్పెక్టరుగారు మాత్రం నవ్వారు. నన్నంటే అన్నారు, నా అధికారిని అన్నారె అని నాకు దుర్భరమైన విచారం వేసింది. ఆయనమటుకు ఒకటే నవ్వటం.

'ఈ రోజు నాకు అన్నం బొత్తుగా సయించలేదు' అని ఆయన దినచర్యలో వ్రాసుకొన్నాడు. ఇదికూడా సామాన్య శిక్షకు ఉదాహరణమనే పాఠకులు గ్రహింతురుగాక.

నాగరాజుగారిని విద్యార్థులు, ఏదో ఆకాస్తా మంచిమాట చేసినప్పుడు ఆయనవెళ్లి రామమూర్తిగారితో మొర పెట్టుకొని "అయ్యా, నే నీ ఉపాధ్యాయవృత్తిని వదిలేస్తాను. బతికేలా గునలేదు. దెబ్బలు తిని మళ్ళీ ఏమొఖం పెట్టుకొని పది మందిలో తిరిగేది" అన్నాడు. రామమూర్తిగారు సహజ గాంభీర్యంతో — "ఏమొఖంతోనా?— ఉపాధ్యాయుని మొఖంతో— అయితే ఎన్నోసారి నీవు దెబ్బలు తినటం" అని సాగరసదృశమైన గాంభీర్యంతో అడిగాడు. నాగరాజుగారు పాపం కళ్లు తేలుస్తూ "ఎన్నోసారికూడానండి నాకర్మంకాలితే!" అన్నాడు. అపుడు రామమూర్తిగారు గొంతు సవరించుకొని "ఓస్, మొదటిసారికే ఇంత! పిచ్చివాడా, నిక్షేపంలాంటి ఉద్యోగాన్ని వదలుకొని నోట మన్నుకొట్టుకుంటావా? ఎవరుచెప్పారు నీకాసలహా। ఎవరు చెప్పారంటా!

అ..రానమా! ఇటువంటివి పెట్టుకుంటె నెగ్గినట్టే! నాజీవితం ఆ..గాతీసుకో. నన్నుజూచి ధైర్యంతెచ్చుకో. ఎందుకు. పిచ్చిన పడతావు. కొట్టారు అంటావు! కొట్టింది ఎవరిని? మొదట నన్ను నెల్లూరులో కొట్టారు. తరువాత గుంటూరు స్కూలులో పనిచేస్తుంటే అక్కడ కొట్టారు. అటు తరువాత నూజవీడులో, తరువాత ఏలూరు, దెందులూరు, ఆత్మకూరు, అనకాపల్లులలో కొట్టారు. విశాఖపట్నంలో సముద్రపు ఒడ్డున పడేసికొట్టారు. రాజధానికి సుఖాలపడి ఉందామని ఈ బరంపురము వస్తే ఇక్కడా కొట్టారుగదా! కాబట్టి దెబ్బలు తినటం ఈజీవితంలో సామాన్య విషయంగా ఎంచి ధైర్యంగా తిరుగు" అని రామమూర్తిగారు సలహా ఇయ్యటం నాకు తెలుసు.

కాని నేను జాగ్రత్తగా ఉండి కుర్రవాళ్ళయందు అనురాగం కనపరచి, కఠిన శిక్షలకు లోబడకుండా తప్పించుకొన్నాను. నమ్మరూ!

# 4

## లంగూడీ ప్రకరణము.

పాఠశాలలలో తెలుగు పండితులకు బొత్తిగా గౌరవం లేక పోవటం ఆ క్లాసులో పిల్లలు విజృంభించి అల్లరిచేసి ఇతరక్లాసులలోకూడా పనిజరుగకుండా చేయటం అందరికి తెలిసినవిషయమే. ఇంగ్లీషుక్లాసులో నోరెత్తి రెండుమాటలు మాట్లాడలేని గుంటడికి తెలుగు క్లాసులో వల్లమాలిన లేనిబింకం వస్తుంది. ఇతర క్లాసులలో బెంచీలతోపాటు నిర్జీవ ప్రాణులలాగు ఉండేవాడు ఈక్లాసు వచ్చేసరికి సజీవుడై గొంతెత్తి ఉపన్యాసాలు ఇస్తాడు. అంతేకాకుండా ఇంగ్లీషు క్లాసులో మూగవోయిన అతని సరస్వతి తెలుగు క్లాసులో ఛణక్ ఛణక్ మని నాట్యం చేస్తుంది.

ఇటువంటి అవస్థలన్నీ చూచి మా ప్రధానోపాధ్యాయుడు తెలుగుయందు అభిమానంగల నన్ను తెలుగు పాఠాలను చెప్పటానికి నియమించినారు. ఇంగ్లీషు భాషాపండితుడు తెలుగు చెబితే అతనిక్లాసులో అల్లరి ఉండదని, బోధన నూతన పద్ధతులను అనుసరించి ఉండి సుగ్రాహ్యమై సౌలభ్యానికి ముడిపడుతుందని ఆయనగారి ఊహ.

నేనూ తెలుగుభాషయందుండే అభిమానంవల్ల తెలుగు పాఠాలు చెప్పటానికి ఒప్పుకొన్నాను. నాకు భాషలో పాండిత్యంలేదు. కాని పరిచయం మాత్రం ఉంది. కాబట్టి ఇంటివద్ద చదువుకొనివెళ్ళి బోధించలేకపోతానా అని అనుకొన్నాను.

నాకు తెలుగులో పాండిత్యం లేదని వ్యాకరణం క్షుణ్ణంగా

చనివి యుండలేదనీ ఎట్లా తెలిసిందో మరి; కొందర్కి తెలిసింది— తెలిసిందని నే ననుకొంటాను. నిజానికి, వ్యాకరణంతో పరి చయం కలుగజేసికొన్నాను గాని పరీక్షకు నిలబడలేను. ఎప్పుడు చెప్పవలసినసూత్రం అప్పుడు వల్లించుకొని పోదామని మనస్సు లో సంకల్పించుకొన్నాను. అసలు రహస్యం అదీ.

అయితే ఒకరోజున ఆ పోషగాటి కుర్రవాడు వచ్చి „ లంగూడీ " అంటే ఏమిటండీ అని నన్ను అడిగినదాకా నాకు వ్యాకర ణపరిభాష రాదని నే ననుకోలేదు. అతగాడొచ్చి వినయంగా „ మాస్టారూ ! లంగూడీ అంటే ఏమిటండీ " అని నన్ను అడి గాడు. „ లంగూడీ ! లంగూడీ ఏమిటోయి ? అయినా ఇపుడు ఆవిషయం తెచ్చి పాఠం పాడుచేస్తావేమి, 'సమాసంబు నం బ్రాతాదుల తొలియచ్చు మీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగా నగు' అనే సూత్రం అర్థం అయిందా " „ లన్నా. అయిందండి మాస్టారూ ! ఇపుడు నే నడిగిన మాట వ్యాకరణసంబంధమైనదేనండి " అని వినయము ఉట్టిపడుతూ ఆ కుర్రవాడు విషయం విన్నవించాడు. వ్యాకరణం నేను బోధిస్తున్నప్పుడు తత్సంబంధమైన విషయము వచ్చినపుడు సరి యైన సమాధానం చెప్పటం నాకర్తవ్యమే అని క్లాసులో కుర్రాళ్లు అంతా అభిప్రాయపడ్డట్టు వాళ్ళ ముఖలక్షణాలవల్ల నాకు బోధపడ్డది. „ సరే. ఆమాట నీకు ఏ వ్యాకరణంలో వచ్చింది ? " అన్నా. „ తా. వెంకయ్య వ్యాకరణం చదువు తుంటే ఆమాట వచ్చిందండి. అర్థం తెలియక అడిగానండి " అని ఆకుర్రాడు అన్నాడు.

ఇదివరకే నాకేదో వ్యాకరణం క్షుణ్ణంగారాదని అనుమాన పడుతున్న పిల్లలముందు వ్యాకరణపరిభాషలో ఒక్కపదానికి అర్థం చెప్పలేకపోతే నాగతి ఏమవుతుందో కొంచెము ఆలోచించండి. అందులో ఇదివరలో ఒక సందర్భములో వాళ్ళతో నేను చిన్నయసూరి, సుప్తార్థప్రికాశిక, ఆంధ్ర శబ్దాను శాసనము, ప్రౌఢవ్యాకరణము, త్రిలింగ లక్షణము, అథర్వణకారికలు మొదలైన గ్రంథాలు చదివియున్నానని చెప్పాను. అప్పుడే పిల్లలు ఒకరిమొఖం ఒకరు చూచుకొని తలలొంచుకొని ముసిముసినవ్వులు నవ్వుకొన్నారు. ఇప్పుడు తా. వెంకయ్య వ్యాకరణంలోని పదానికి అర్థం చెప్పలేకపోతే ఆ పిల్లలు నాకేమి రాదు అనుకొనటమేకాకుండా, వాళ్ళభాషలో, సొరకాయలు నరికాడు, అనుకొంటారేమో అని భయంవేసింది.

నాకేకాదు, ఈ పుస్తకం చదివే మహాశయుణ్ణి, వ్యాకరణశాస్త్ర విశారదుడైనవాణ్ణి, ఎవరైనా ఇట్టి ప్రశ్న వేస్తే భయం వేస్తుందా వేయదా చెప్పండి. „ఆంధ్ర వ్యాకరణబోధనోపక్రమణలోనే పెల్లురుము పైబడవలెనా” చెప్పండి. ఎంత సేపు ఆలోచించినా, జ్ఞాపకశక్తిని ఎంతత్రవ్వినా అటువంటి పదము విన్నట్టే జ్ఞాపకంలేదు.

తెలివిగాతప్పించుకొందామని„అబ్బాయి” రేపు చెపుతాను. ఇప్పుడు ఒకనిమిషంలో బోధపర్చటం కష్టం. గంటకొట్టుతున్నారు చూశావా? (అదృష్టవశాత్తుగంటకొట్టారు.) అని ఆసమయానికి యుక్తాయుక్తంగా తప్పించుకొన్నా. మర్నాడు మళ్ళీ వాడు జ్ఞాపకం ఉంచుకొని నన్నడగడసి మొండి ధైర్యం.

అయినా ఎందుకైనా మంచిదని ఆ రోజు రాత్రి అంతా, తా. వెంకయ్య వ్యాకరణం ఆద్యంతం ప్రతివాక్యమూ శల్య పరీక్ష చేస్తూ చదివాను. ఆపదం ఎక్కడా కనుపించలేదు. మరునాడు శాస్త్రిగారిని అడిగా, ఏదైనా సంస్కృతవ్యాకరణ సంబంధమైన పదమేమోనని. ఆయన చాలాచేపు ఆలోచించి ‹‹ ఇటువంటి పదము ఎక్కడాలేదండి. వాడు మిమ్ములని వేళాకోళం చేస్తున్నాడేమో అని అన్నాడు. నన్ను అంటే ఇంగ్లీషుభాషాపండితుడ్ని వేళాకోళం చేస్తున్నారనే మాట వినే సరికి మనస్సులో వేళాకోళానికి వెక్కిరింతలకు నే నేమైనా మామూలు తెలుగు పండితుండ్నా అనే భావం పరుగెత్తుతూ ఉపశాంతికి కారణమైనా, శరీరం కాక ఎక్కనే ఎక్కింది. సాటి ఉపాధ్యాయుడిని ఏమీ అనలేక గుటకలు మింగి క్లాసులోకి పోయి, ఆమాటసంగతే మరచిపోయినట్లు నటిస్తూ పాఠం మొదలుపెట్టి చెబుతున్నాను. నేను ఊరుకొన్నా వాడు ఊరుకోలేదు. వాడెందుకు ఊరుకొంటాడు ? వాడు తార్తారు వంటివాడు.

వెనుక రష్యనులకు తార్తారులకు యుద్ధం జరిగింది. అనేక యుద్ధాలలో జయించిన రష్యనులు మహాగర్విష్ఠులు. కాని ఆ యుద్ధంలో రష్యనులే ఓడిపోయి పరుగెత్తటం మొదలు పెట్టినారు. తార్తారులు వెంబడించినారు. కొంతదూరము పోయిన తరువాత రష్యను సైనికుడొకడు తన సేనానితో ‹‹ తార్తారుని పట్టుకొన్నాను. వెంటనేవచ్చి నాకు సహాయం చేయవలసింది ” అన్నాడు. సేనాని ముందునుంచి, ‹‹ మంచిది ఆగటానికి వీలు లేదు. వాడిని లాగుకొనిరా ” అని గర్వంతో అన్నాడు. రష్య

నుడు మళ్లీ, ,, వాడు రావటంలేదు. నీవు రావాలె" అని పెద్దగా అరిచాడు. సేనాని" సరే, ఆగటానికి ఏమాత్రం వీలులేదు. వాడిని వదిలేసిరా అని ముందునుంచి కేకేశాడు. ,, నేను వదలినా నన్ను వీడు ఏమాత్రం వదలటంలేదు" అని వెనుకనుంచి రష్యనుడు ఎలుగెత్తి అరచినాడు.

ఆ విధంగా ఆసురాగ్రహ నన్ను వదలక మళ్లీ తయారయ్యే సరికి నా ప్రాణం విసుకెత్తింది. దౌర్జన్యంగా వాడిని కూచో బెడితే నాగౌరవానికే నష్టం. కొన్నిచూపాలలలో అప్పుడే గుస గసలు వెకిలినవ్వులు బయలుదేరినవి. ఏముచేసేది!" సరే, ఆ వ్యాకరణం ఇట్లా తీసుకొచ్చి, ఆమాట ఎక్కడుందో ఒక మాటుచూపించు" అన్నా.

వాడు నిజంగా వేళాకోళానికే అడిగినట్లయితే యిపుడు దివిటీముందు దీపం అయిపోతాడని నా ఉద్దేశం. కాని వాడు నిజంగా పుస్తకం బట్టుకొని రావటం చూసేసరికి, నాగుండె కొట్టుకొందో, కళ్లు కాంతివిహీనం అయిపోయినవో, ఏమైందో మీరు ఊహించుకోండి.

తీసుకొచ్చి పుస్తకం ముందుపెట్టాడు. అపుడు ఒక కొత్తఎత్తు ఎత్తి ,, ఈపుస్తకం వెధవ పుస్తకము. దీని నిండ తప్పులే." అని తప్పించుకొనే మార్గాన్ని తెరచియుంచుకొని ,, ఎక్కడుందిరా ఆమాట" అని అసలు విషయానికొచ్చాను.

వెంటనే వాడు పేజీతీసి వేలుపెట్టిచూపాడు. వాడిమాట నిజమే! లంగూడి అని ఉంది. ఇందాక తెల్లపోయిన వ్యాకరణ విశారదులూ, కౌముదిని తలక్రిందుగా అప్పజెప్ప ప్రజ్ఞగల

ఆచార్యులూ, (ఈసంబోధన ప్రథమ మీచెవులకు క్రొత్తేమో వినండి; లంగూడి పదం వ్యాకరణ పరిభాషలో చేర్చుకోండి, మా కురాళ్ళు చూపించిన వంక చూడండి. అ, ఆ, ఇ, ఈ, లంగూడీ, అనే వాక్యం ! అది.

అవునవును, మాహైస్కూలు విద్యార్థి విషయమై మీక ప్పుడే ఉదాసీనభావం కలిగిందని తోస్తుంది. అక్కరలేదండి నాటకంలో మొదటిపద్యానికి నాంది యని పేరని అందరికి తెలుసుకదా ! దానితరువాత సంస్కృతనాటక రచనాసాంప్రదాయాన్ని అనుసరించి నట్యాదులతో సంభాషించే సూత్రధారుడు వస్తాడామె! ఈరెంటికి ముడివెట్టి దాంపత్యము కుదిర్చి నాంది యనునది సూత్రధారునిభార్య అని వ్రాసి నాటకానికి సంబంధంలేని నాందిని ఒక ఇంటిదాన్నిచేసి ఇంత పసుపూ కుంకుమా, ఇప్పించిన కాలేజీ విద్యార్థిచేత మెప్పువడసి భ్రాతృత్వము స్వీకరించిన, మాకుర్రవాడి ప్రజ్ఞకు చదువరులు జోహారులు చేయకపోవటం వట్టి అన్యాయం.

# 5

## వ్యాకరణబోధ.

"సర్వ విశ్వ కతర కతమ చద్ ఉభయద్వినేమ సము పూర్వపద అవర దక్షిణ ఉత్తర ఎదత్ కియతు ఇత్యాదయః సర్వాదీని శబ్దాని సర్వనామసంజ్ఞాని స్యుః" అని సర్వనామానికి నిర్వచనంచేసిన వ్యాకరణ కర్తలను వల్లించుకొని తెలుగు పాఠాలుచెప్పే ప్రాముఖ్యతకు ముడివేసికొని మా పిల్లలకు సర్వనామ పదవ్యుత్పత్తిని గురించి చెప్పి దాని ప్రాధాన్యాన్ని గురించి బోధించి దాని ప్రయోజనాన్ని గురించి వివరంగా వ్యక్తపరిచి ఇంకా నిదర్శనంగా ఉండటానికి ఏరామకథో మొదలుపెట్టి రామాయణమంతా రాముడు రాముడు అన్న నామవాచక పునశ్చరణతో నింపేస్తే అది రామకోటిలాగుండి మోక్షప్రదమైతే కావచ్చుకాని వ్యాసంమటుకు ఎంతసొంపుచెడి యుంటుందో చూపి వ్యాసరచనలో సర్వనామముయొక్క వాడుకవల్ల వ్యాసానికి జిలుగులు ఎట్లా దిద్దవచ్చునో కనపరచాను. పిల్లలందరికీ చక్కగా విషయం మనస్సుకు ఎక్కింది. అందులో సందేహం ఏమీలేదు.

అట్లు ఆ విషయం వాళ్ళ బుర్రల కెక్కటంలో వైపరీత్యమేమీలేదుకాని, వాళ్ళ మనస్సులలోఅది పొందిన పరిణామమే విచిత్రము. ఆపాఠంగాటికుర్రాడు లేచి మొఖంమీద పడుతున్న జుట్టును పైకి అసలే తెలివివల్ల బరుకెక్కిన తలమీదికి చేత్తోతోసేస్తూ "ఆ వాడు వీడు తాను నే నేనా నండి సర్వనామాలు; లేకపోతే ఒకళ్లకుండే కొంటె పేర్లను మాలోమేము సంభా

షించేటప్పుడు వాడుకుంటే మాకు ఆ వాడు ఎవరో తెలి
స్తుందే! అదికూడా సర్వనామమేనాండి" అన్నాడు ఆప్రశ్న
వినేసరికి అవేవో భయపుటూహాలు మేఘాకృతిగా నామనస్సు
లో పరుగెత్తటం మొదలుపెట్టినవి.

ఇంతలో వాడు వేసినప్రశ్న స్పష్టంగా లేకపోవటంచేత
నాకు అర్థంకాలేదు అనుకొనికాబోలు "అదికాదండీ మాస్టా
గూ! ఇపుడు ఒకాయనకు 'చిట్టిగారె' అని పేరుంది అనుకోండీ,
ఫలాని ఆయనకు చిట్టిగారెలంటె యిష్టము. 'ఫలానిఆయన
చాలా మంచివాడు' అని అనకుండా, 'చిట్టిగారె చాలా మంచి
వాడు' అంటే, రెండు వాక్యాలలో చెప్పవలసిన భావం ఒక్క-
వాక్యంలో ఇమడటంకాక, చిట్టిగారె అనేపదం సర్వనామము
ఇచ్చే ప్రయోజనాన్ని ఇస్తుంది కాదండీ. ఇవికూడా సర్వ
నామాలేనాండి" అని కళ్లల్లో తెలివి వికృతంగా వెలిగించు
కొంటూ అన్నాడు. అప్పటికి నాభయాలన్నీ భయదజీమూ
తాలలాగు నన్ను ఆవరించుకొన్నాయి. "నాకు చిట్టిగారెలు
ఇష్టం అనేసంగతి వీళ్లకేమైనా తెలిసిందా చెపుమా" అని
నాలోనేను పళ్లు బిగబట్టుకొని అనుకొన్నాను. తెలిసే అట్లా
చేస్తున్నారని అనుమానశంకను బట్టి నేను నిర్ణయించుకోవలసి
వచ్చింది కాని అప్పట్లో బింకాలన్నీ కళ్లల్లో నిలవబెట్టి "ఒరే
అబ్బాయి, ఈధాతు యుష్మదర్థంబులమీద దక్క- ఉంపుంసు
పేర్ల ఉకారైకాంత శబ్దంబులకు ద్వితీయాషష్ఠుల ఇకారోకార
చకారంబులు నిషేధంబులు" అని అధర్వణకారికలలో ఉంది
మరి నువ్వు చెప్పింది ఎట్లా సరిపోతుంది? తెలిసిందా?" అని
వ్యాకరణ నిర్ణేతకుమల్లె ఒక్కబిగువున సూత్రాన్ని ఊదేసి

,, నీకు ఈమాత్రం తెలియదా " అనేభావాన్ని, ,, నాకెంత పాండిత్యపటిమ ఉందో చూశావా ! " అని ప్రకటించే భావాన్ని తనలో జోడించుకొన్న ఒక్క చిరునవ్వు నవ్వేసరికి, ఏమీ తెలియని కారణంచేతకామాలు అందరూ వాడివంక చూచి ,, మాడావులే ఊరుకో" అన్నచూపులు చూశారు.

అల్లా దౌర్జన్యంచేసి ఆరోజుఅవమానాన్ని తప్పించుకొన్నా. ఆబయలుదేరిన కొంటెతనం, దానికి సహజమైన పరిణామాన్ని పొందనే పొందింది మర్నాడు బోర్డుపైన గారెలబుట్టబొమ్మ గీశారు. దానినిండా చిట్టిగారెలున్నవి. బొమ్మమటుకు బాగా వుంది. నాకు కోపంవచ్చే విషయంకాకపోతే దానికి నూటికి తొంభైమార్కు లిచ్చేవాణ్ణి. అయినా కళా నైపుణ్యాన్ని లోలోన మెచ్చుకొని గుటకలు మ్రింగి ఊరుకొన్నాను. అటు పైని వారంరోజులు గడిచిన తరువాత ఒకరోజు నేను వ్యాకరణంచెబుతూ, ,, కుఱు-చిఱు-కఱు-నడు-నిడు శబ్దంబుల అడల కచ్చుపరంబగునపుడు ద్విరుక్తటకారంబగు " అనే సూత్రాన్ని నవీనబోధనా పద్ధతుల ప్రకారం బోధపరుస్తూ ఉదాహరణ క్రింద ,కుఱు+ఉసురు=కుట్టుసురు, చిరు+ఎలుక=చిట్టెలుక, నడు+ఇల్లు=నట్టిల్లు, కడు+ఎదురు కట్టెదురు' అనునవి ఉదహరించి శ్రమపడి చెబుతుంటే అందరూ చెవులు నిక్కపొడుచుకొని వింటున్నారు. ఇంత నిశ్శబ్దంగా ఉండటం ఏదోప్రళయ సూచనే అని నేను అనుకొంటూ ఉండంగానే మళ్లీ ఆపొడుగాటి కుర్రాడు లేచి ,,సార్ ! చిరు+గారె=చిట్టిగారె అవుతుంది గాదండీ" అన్నాడు. అర్జునుడు కర్ణుడిపైకి సర్పాస్త్రము ప్రయోగించినపుడు చూచిన చూపులతో ,,సర్వనామాలలో

తప్పినా, సంధిలో తప్పలేదురా బాబూ నాకీ చిట్టిగారె సంధానం" అని అనుకొని ఏమీచేయలేనప్పుడు మెదలకుండా ఊరకోవాలె అనే రాజనీతిని స్మరించాను.

ఆరోజునుంచీ చిట్టిగారె అనే పదం నాకు రూఢం అయి పోయి నాకున్న బిరుదులతోపాటు చేరిపోయింది. బిరుదు లన్నిటిలోను అదే గొప్పదైనట్లూ, దానికున్న ప్రాముఖ్యం దేనికీ లేనట్లూ, వాళ్లు నన్ను 'చిట్టిగారె మాస్టారు' అని పిలు స్తారట. నామొఖంఎదుట ఎవరూ అనకపోయినా నాకున్న సర్వనామం అది. సర్వనామము అంటె సర్వత్రా ఉపయోగిం చేనామము. ఇదీ మాకుర్రవాళ్లు ఇచ్చిన నిర్వచనమే.

ఇటువంటి సర్వనామాలు అనివార్యంగా వస్తవి. మాస్టరు నల్లగాఉంటే కాటికకాయ అంటారు. ఎఱ్ఱగాఉంటే దొండపండు అంటారు. పాలిపోయి తెల్లగాఉంటే సున్నపు పిడత అంటారు. సన్నగాఉంటే పీరు అంటారు. లావుగా ఉంటే బాయిలర్ అంటారు. బొజ్జ పెద్దదైతే కూష్మాండం అని పొట్టిగా ఉంటే మెట్టవంకాయ అని అంటారు. కళ్లు మసకలైతే కబోదిపక్షి. ఒకకన్ను గుడ్డి అయితే శుక్రాచారి. పాఠం బిగ్గరగా చెబితే డబ్బా, మెల్లగాచెబితే బోటు. గబ గబా నడిస్తే మెయిల్, మెల్లగానడిస్తే స్నెయిల్. కాబట్టి ఎట్లావున్నా ఒకపేరు అతక్కమానదు.

అయితే ఈపేర్లు తినడం పిల్లలతోపాటు సరదాగా తిరుగు తూ, వాళ్ళకు చదువు సంధ్యలు రావాలనే మాట తలపెట్టని వాళ్ళవిషయంలో మాత్రం నిషేధము. ఏదోచెప్పి చెప్పక

తప్పించుక తిరిగే మాష్టర్లవిషయంలో బహుళము కాని కష్ట పడి చెప్పేవాళ్లవిషయంలో మాత్రం నిత్యం!

క్రొత్తసూత్రాలు కల్పించటంలోకి కూడా మా కుర్రాళ్ళ జ్ఞానం వ్యాపించింది. ‹నామంబులకు సమానమైన యర్థంబు స్ఫురించు వేరొక శబ్దంబు తత్సమంబు' అని సూత్రం చేశారు. జానికిరామయ్యగారికి తోటకూర ఇష్టము. కాబట్టిన్నీ, తోట కూర మాస్టారు అన్నప్పుడు జానికిరామయ్యగారి పేరు తప్ప ఇంకోపేరు స్ఫురించదు కాబట్టిన్నీ తోటకూర అనే శబ్దం తత్సమమైంది. చిట్టిగారె, పులుహోర, గోంగూర, కంది పచ్చడి, సొరకాయ, సాంబారు, మొదలైన శబ్దంబులు కొన్ని కొన్ని వ్యక్తులయెడ తత్సమశబ్దాలైనవి.

ఇట్లు సర్వనామఘట్టములో బయలుదేరిన కొంటెతనం తత్సమఘట్టములో ప్రవేశించి తద్భవఘట్టములోకి పాకింది. ‹‹వర్ణలోప వర్ణాగమ వర్ణవ్యత్యయములచే దద్భవంబులగు" అనే సూత్రం వాళ్ళకు మనస్సుకు పట్టిన తరువాత, అది వాళ్ళ కల్పనాశక్తులకు ఉత్తేజం కలుగజేసినది కాబోలుమరి. మాస్టర్ల పేర్లు, ఆలోప ఆగమ వ్యత్యయాలను పొంది తద్భవరూపాలకు మాతృత్వం సంపాదించుకొన్నవి. శుచిః చిచ్చు, ప్రవాళమ్ పగడము, రథః అరదము, అయినట్లుగానే నరసింహం నరుసు, జానికిరామయ్య జ్యాకీ అనే రూపాలను పొందటం మొదలు పెట్టినవి. మాతోడి ఉపాధ్యాయులపేర్లూ, నాపేరూ, నాస్నే హితులపేర్లూ మాపరీక్షాధికారిపేరు, చివరకు తల్చుకొంటే గుండెకొట్టుకుంది. మాప్రధానోపాధ్యాయుడి పేరుకూడా

ఆ వర్ణలోప ఆగమ వ్యత్యయాలకు లోనగునట్లు చేయటమే కాకుండా వాటిని గోడలమీద వ్రాయటం మొదలుపెట్టారు మాకుర్రాళ్లు.

నేను వేసిన వ్యాకరణబీజాలు మొలకలెత్తి మహావృక్షాలై ఇట్టి విపరీతపు ఫలాలను ఇస్తవని కలలోనైనా అనుకోలేదు. ఐతే మా కుర్రవాళ్ల తెలివితేటలకు ముఖ్యంగా వాళ్లకు పేర్లను కల్పించటంలోగల ప్రజ్ఞకు నేను లోలోన ఆనందించాను. అయితే మా ఉపాధ్యాయులలో పేదగుండె కలవాళ్లు, నా తెలుగుబోధనవల్ల వారికి మారుపేర్లు పుట్టటం సహించలేక ప్రధానోపాధ్యాయునితో చెప్పుకొన్నారు.

ఈ విషయం పెద్ద అధికారిదాకా వెళ్లిందని నాగుండె గుభేలుమన్నది. ఆయన మంచి పుస్తకాలలో ఎప్పుడూ ఉండాలని ప్రయత్నంచేస్తున్న నేను, ఆయనే నాకు జీవనాధారం కల్పించిన దేవుడని నమ్మియున్న నేను, నాఅనుంగుపుత్రుని మాప్రధానోపాధ్యాయుని పేరుతోకాని ముద్దుపెట్టుకోని నేను, నాఉదరపోషణకోసం, నాఉద్యోగం స్థాయిత్వం కోసం ఈ పని చేయడానికి ఒప్పుకొన్న నేను, నేను నేనని తోడి ఉపాధ్యాయులకు తెలిసిన నేను ఈమాట విని విధిని నిందించుకొని ఉద్యోగానికి నీళ్లు వదలుకొని దరిద్రదేవతను ఆహ్వానించుకొన్నాను.

మా ప్రధానోపాధ్యాయుడు మర్నాడు నన్ను పిలిపించాడు. ఆగదిలోకి పోవటం అంటే నాకు యమలోకంలోకి మహానరక బాధలు అనుభవించటానికి పోయే జీవుడికిమల్లె, గాలి తాకుడుచే రావియాకువలె, కంపించిపోయినాను ఏదో ఇంత కలో

అంబలో తాగి బతకకుండా నాకు ఈఉపాధ్యాయవృత్తి ఎందుకొచ్చింది? వచ్చిందనుకో! ఈవ్యాకరణ బోధన ఎందుకిచ్చారు? ఇచ్చారయ్యా ఈకుర్రాళ్లు యిల్లా విపరీత పోకడలు పోవటం ఎందుకు ? పోతేమటుకు ప్రధానోపాధ్యాయునికి ఎందుకు తెలియాలి ? అని యింతసేపు పరితాంపంపొంది, ఆ ఆపదనుండి తప్పించమని శ్రీకృష్ణున్ని ప్రార్థనచేసి, ,,లావొక్కింతయులేదు, ధైర్యము విలోలంబయ్యె'' అనే పద్యం చదువుకొంటూ, అడుగడుగుకూ, రాధామాధవుడిన్ని ధ్యానంచేస్తూ ఆయన గదిలోకి వెళ్లాను.

అయితే శ్రీకృష్ణభగవానులు ఆయన హృదయంలో దూరి ఆయనను నాకు ప్రసన్నవదనుణ్ణిగా చేశాడు. నేను పడ్డ అవస్థ అంతా వట్టి విభ్రమము. ఈ పేర్లు పెట్టటం గురించిన కథ అంతా ఆయన విని ఆనందించి తెగనవ్వి అయ్యా, ఈ వృత్తి వృక్షాన్ని ఆశ్రయించుకొన్న పక్షులు ఈసంఘటనలు. మనం వానిని తరిమివేయలేము. అవి అట్లా ఉండటమే ఆనందం. కమలంమీాద తుమ్మెద వ్రాలుతుంది. భ్రమరముయొక్క కాళ్లతాకిడిచే పుష్పానికి తాత్కాలికంగా బాధ కలిగినా, ఆ తుమ్మెదవల్ల పుష్పానికి శోభే కలుగుతుంది. అట్టి పుష్పమే చిత్రకారుని దృష్టిలో సంపూర్ణమైన సౌందర్యముతో కూడిన వస్తువ అని నాకు నచ్చచెపటమే కాకుండా, ఉపాధ్యాయ వృత్తిలో ఇదియొక మాధుర్యం అని అందరికి తెలిసేటందుకోసం ఏవ్యాకణపరిభాష ప్రకారం ఏపేరు ఎట్లా మారింది అంటే నరసింహం నరసుగాను, వెంకయ్య వెంకాయగాను, ఉమామహేశ్వరరావు ఏమీా రానేశ్వరరావుగాను, రాజారావు బాబా

రావుగాను, వరదాచారి బురదాచారిగాను ఎల్లెట్లు మారినవో, వ్యాకరణలెక్కలలో బిగించి, విషయానుక్రమణికతో సహా ఒక లిస్టు తయారుచేయుమని ఆయన నాకు చెప్పి 'బతికానురా బాబూ' అని నేను వస్తూ ఉంటే, తనపేరుకూడా ఆ చిట్టాలో వుంచి తీరాలని చెవులో అనపెట్టాడు. మహానుభావుడు రసజ్ఞుడు ఆయన. ఆఖరుమాట ఏమిటంటే ఈ అల్లరి ఆఘట్టంలో ఆగక సమాసప్రకరణంలోకి పాకి ఇద్దరు ఇద్దరిమేస్టర్ల పేర్లు కలిసి ద్వంద్వసమాసంగా తయారైనవి. వట్టి రోజులలో ఉపాధ్యాయజీవితమాధుర్యాన్ని అవి వేయినోళ్లతో చాటుతూ ఉన్నా. ఇన్‌స్పెక్టరు వచ్చినరోజులలో మాత్రం గోడలపై వేయబడు సున్నపుపూతయొక్క తెలుపులో నుంచి అసలు పులు తొంగి చూస్తూఉంటవి.

---

# 6

## వాళ్లు — వీళ్లు.

### ౧

అసలు ఈ ప్రకరణానికి 'వారు వీరు' అని నామకరణం చేద్దామనుకొన్నాను. 'వారు' అనేసర్వనామము ఒక రూఢార్థంలో వాడుతున్నాను. మావారు అంటే భర్తకు, మా వాళ్లు అంటే భార్యకు ఎల్లారూఢమో, వారు అంటే అధికారి వర్గానికి, వీళ్ళు అంటే మాపిల్లలకు రూఢమని గ్రహించగల రని విశ్వసిస్తున్నాను. అయితే పిల్లకాయలవిషయంలో వీరు అనక సాధారణంగా వీళ్లు అంటాము. అందుకని ఆమాటే తీసుకొని దానికి 'వాళ్లు' అనే మాటను జోడుచేసాను. అధికారులూ బాలురూ కూడా మనుష్యుల నెల్లా అర్థంచేసుకొంటారో, మేము చేసిన పనులను ఎట్టి సంకుచితమైన దృష్టితో చూస్తారో, వాటికి ఎట్టి అర్థాంతరాలు కల్పిస్తారో, ఎట్టి విపరీత పరిణామంతో వారిమనస్సుకు పటుతయ్యో చూపేందుకై సాహసిస్తున్నానని సమదృష్టిగలమీకు విన్నవిస్తున్నాను.

వాళ్లలోకల్లా మాఅధికారి మామేనేజరు. ఆయన ఉన్నత విద్యను గరపే పాఠశాలను స్థాపించి ఎంతో కష్టపడి నడుపుతున్నాడు. పూర్వము ఏచెట్టుక్రిందనో ఉండేది సర్వకళాశాల సహితము. విద్య ఉచితమేకాక 'మావిద్విషావహై' అని అధ్యయనము ప్రారంభించేస్తితి పోయి, విపరీతపరిస్థితులొచ్చినవి. ఇట్టి........స్థితులలో ఒకపెద్ద పాఠశాలను పాలించటం కష్టతమమైన విషయము.

మా అధికారి బహునేర్పుగా వ్యవహారం నడుపుతూ, సొమ్ము ఎన్నివిధాల రాబట్టాలో అన్నివిధాల రాబట్టి ఎంత తక్కువ వ్యయంచెయ్యాలో అంతే చేస్తాడు. ఉపాధ్యాయులను నియమించటం లోను, తక్కువజీతాలకు బేరం ఫైసలు చేయటంలోను ఎటువంటి అసమాన ప్రజ్ఞఉందో పాఠకులకు బోధపడ్డదికదా! ఇక ఉపాధ్యాయులకు సంవత్సరం సంవత్సరం జీతాలు ఎక్కువచేయటం అనే ఆచారం అక్కడ తొలగించారు. ఆయన ఇచ్చింది పుచ్చుకొని సంతోషించమని బోధిస్తాడు.

సంవత్సరం పనిచేసిన తరువాత ఒకటో రెండో రూపాయలు ఎక్కువ జీతం యిస్తే వుపాధ్యాయులకు నూతనోత్సాహం కలుగుతుందనీ, పాఠశాలపనియందు అభిమానం పట్టుదల కలుగుత వనీ, ఏదో పది సంవత్సరాలు పనిచేస్తే భవిష్యత్తు సౌఖ్యావహంగా ఉంటుందనే ఆశ ఉంటేనేకాని ఉపాధ్యాయుడు కుతూహలంగాను ఉత్సాహంగాను పనిచేయలేడు అనే విద్యావిధాన తత్వజ్ఞుల మాటలలో ఆయనకు బొత్తుగా నమ్మకంలేదు.

ఆయన ఆసిద్ధాంతాన్ని పూర్వపక్షంచేసి జీతాలు తక్కువగా ఉండటం మూలాన మితవ్యయము అలవడుతుందనీ, జీతాలు అభివృద్ధి లేకపోవటం మూలాన సంతృప్తి ఓపిక మొదలైన సుగుణాలు పట్టుపడతవనీ ఆయన విశ్వసిస్తాడు. జీతాలు వృద్ధి లేనపుడు పిల్లలు వృద్ధిఅగుట జరుగుతుందని ఆయన అనుభవంవల్ల కనిపెట్టాడు. ఆదాయంలో క్షయానికి, సంతానంలో

వృద్ధికి కార్యకారణసంబంధం ఉందని ఆయన సంతానం లేని వాళ్లకు, అజీర్ణం గలవాళ్లకు, ఆకలిలేనివాళ్లకు కొంచెం జీతం తగ్గించి చూస్తాడు.

కథలో వాదించిన ఎలుక ఇదే సిద్ధాంతాన్ని వ్యక్తపరుస్తున్నది. మనిషి మూషికంతో 'నీవు, నీజాతి వారు కలసి మాఇండ్లలో చేరి గాదెలకు బస్తాలకు బొరియలు పెట్టి ధాన్యం అంతా తినేస్తున్నారు' అంటే మూషకరాజము తెలివైనచూపులు చూస్తూ 'మేము కొంచెమో గొప్పో తిన్నా, మీ యిండ్లలో ప్లేగువ్యాధిని తీసికొని వచ్చి ప్రవేశపెట్టి, మీ కుటుంబాలలో పడి తినేవాళ్లసంఖ్య తగ్గిస్తున్నామా, లేదా? ఉపకారమే చేస్తున్నా మన్న కృతజ్ఞత అయినా లేదుమీకు' అన్నదట.

ఇట్లా ఆయన పరిపాలన జరుపుతూ అప్పుడప్పుడు పాఠశాలను చూడటానికి స్వయంగా వస్తాడు. ఒకరోజున మిడిమిడి ఎండలో వచ్చాడు. పొద్దుటి బడి అయిపోయింది. ఉపాధ్యాయులమంతా ఒకగదిలో కూర్చుని ఉబుసుపోక కబుర్లు చెప్పుకొంటున్నాము. వారు వచ్చారని తెలిసి వెళ్లి కలుసుకొని, ఆయన ఎక్కడికి వెళ్లితే అక్కడకల్లా వెనకాల నడిచాము.

ఆగదీ, ఈగదీ చూచుకుంటూ ఆయన సైన్సు గదిలోకి వెళ్లాడు. ఆమూల ఈమూల తేరి పారచూచాడు. ఒక మూల పగిలిపోయిన గాజుబుడ్లు కనిపించినవి. బుడ్లు అనే ప్రయోగం నేను ఆయనవద్దనే నేర్చుకొన్నాను. ఆంగ్లంలో టెస్టుట్యూబులని ఫ్లాస్కులని అంటారే వాటికన్నిటికి కలిపి బుడ్లు అనేమాట సామాన్యనామముక్రింద ఆయన వాడినాడు.

ఈ బుడ్లుచూచి ఆయన మొదట ముఖం చిట్లించుకొన్నాడు. ఇట్లు ఉదయించిన విసుకల్లా కోపంలోకి పరిణమించగా ఆయన ‘ఏమయ్యా! మంచీ చెడ్డా తెలియ నక్కరలేదా! ఇన్ని బుడ్లు పగల గొట్టించావుకదా ఎవరిసొమ్మ అనుకొన్నావు. చిన్నతనపుచేష్టలా, లేకపోతే కొంటెతనమా? అని నాలుగు చీవాట్లూ వేశాడు.

సైన్సుమాష్టరు, ‘అయ్యా నాకు చాలా విచారం ఉంది. పిల్లలు వాటితో పనిచేసేటప్పుడు ప్రమాదవశంచేత అవి పగులుతుంటవి’ అని వినమ్రుడై విన్నవించాడు.

‘అవునయ్యా, నీకు అంతమాత్రం తెలియదా! గాజుబుడ్లు పిల్లలచేతికిస్తావా? ఇన్నాళ్లు చదివి ఇదేనా నీవు నేర్చుకొన్న విషయం. అసలు అటువంటి సున్నితమైనవస్తువులను పిల్లలు ముట్టుకొనేటంతటి అవసరం ఏం వస్తుంది? ఏదైనా పని ఉంటే నీవు వాడి చూపరాదా?’ అని ఆయన కోపంగా అనంగానే పాపము సైన్సుమాష్టరుగారికి ఏమంటానికి తోచక ‘వాళ్లచేతికి ఇయ్యక తప్పదండీఅని యేమో చెప్పబోతుంటే అధికారి మాటకు అడ్డమువచ్చి,

‘చాలు, చాల్లేవయ్యా అంతతప్పకపోతే నాకు చెప్పక పోయినావా, దానిదుంపతెగ. పోతేపోయింది. ఇత్తడిదో సీనారేకువో ఇనుపవో చేయించి పడేశేవాడ్ని. మాటమాత్రం అనకపోతివి నాతో! కుర్రవాళ్లు మాస్టరుగాఉంటే కష్టసుఖాలు తెలియవు.’ అనిముఖం చిట్లించుకొని హెడ్‌మాస్టరు గదిలోకి పోయినాడు.

తరువాత పెద్దమాస్టరుతో కలుసుకొని ఏదోవిషయమై తీవ్రంగా చర్చించాడు. చివరకు నన్ను రమ్మని కబురు పంపారు. ఏదో కొంప మునిగిందిరా, బాబు, అని మావాళ్లంతా అభిప్రాయపడ్డారు కాని నేనుమాత్రం ఆయన సన్నిధికి నిర్భయంగానే వెళ్లాను.

పెద్దమాస్టరుగారి గదిలో అధికారి, ఇద్దరు ముగ్గురు స్నేహితులు, ఒకరో ఇద్దరో ఉపాధ్యాయులు కూర్చున్నారు. హెడ్‌మాస్టరుగారు దుర్భరమైన విచారాన్ని సూచించే ముఖంతో, 'రావూ నీమీదికి ఒక కేసువచ్చించి. ఆవిషయమై రహస్యంగా నిన్ను అడుగుతానని నేను మనవిచేస్తే, వారు ఒప్పుకొనక నిన్ను పదిమందిలోనే అడిగి చీవాట్లు వెయ్యాలని సంకల్పించు కొన్నారు. వారు అడగటం నీవు సరియైన సమాధానం చెప్పుకోలేకపోవటం ఆదిగాగల కర్మకాండ జరుగకుండ ఇప్పుడే వారిని శాంతించమనీ, ఆనక తగిన సమాధానం చెప్పుకొంటాననీ క్షమాపణపూర్వకంగా మనవి చేసుకో' అని పాపము ఆయన నాకు శిష్యవాత్సల్యముచేత హితము బోధించినాడు.

'అయ్యా, మీరు చెప్పినహితము నేను స్వీకరించలేనందులకు క్షమించండి. రానున్నది రాకమానదు. నేను చేసిన నేరమేమో తెలియజేయండి. తప్పేజేశిఉంటే మీరిచ్చిన శిక్షను అనుభవిస్తాను' అన్నాను నేను ధైర్యంతో.

అధికారి నావంక ఉరిమిచూస్తూ 'మానాగభూషణం మీ క్లాసులోఉన్నాడు తెలుసునా? వాడికి మీరు చెప్పిన విషయం

తెలియక మరొకమాటు తెలిసేటట్లు చెప్పమంటే చెప్పనని అన్నారట! అదేనా చేయవలసినపని. కుర్రవాళ్లకు బోధ పడేలాగు చెప్పనక్కరలేదా? ఉత్తమ ఉపాధ్యాయునికి ఉండ వలసిన లక్షణాలు ఇవేనా' అన్నాడు ఖాండవవనం దహింప నున్న అగ్నిహోత్రుడులాగ చూస్తూ.

నాకు అరికాలుమంట నెత్తికె రాగా ,, అయ్యా, మీరు చెప్పినమాట నిజమే. నేను చెప్పనన్నమాట సత్యమే! అయితే ఎందుకట్లా అన్నానో కర్త కర్మ క్రియలలో చెప్పాలిసి వస్తే, మీరు ఇచ్చే ముప్పైరూపాయలకు నాకు ఒకమాటు కంటె ఎక్కువసార్లు చెపటానికి గిట్టదు. మీయిష్టం." అని ధైర్యంగా ఒక్కగుక్కలో అనేశాను.

అక్కడనున్న పెద్దమనుష్యులు విరగబడి నవ్వారు. పెద్ద మాస్టరుగారు నవ్వును అణచివేసుకొని ముఖం చిట్లించుకొ న్నాడు. అధికారెమటుకు ఆముదంతాగిన ముఖంవేసుకొని క్రిందికి దిగి బండెక్కి మంటుటెండలో వెళ్లిపోయినాడు.

ఆరోజు అట్లా ఆయన వెళ్లిపోయి కమిటీ మెంబర్లలో కొందరికి నావిషయమై దుర్మార్గుడనో, అవిధేయుడనో, లేక పోతే మంచి మాస్టరు కాదనో చెప్పి ఉంటాడు. అధికారుల నిరంకుశప్రభుత్వానికి తలలొగ్గవలసిందేకాని నోరెత్తి చెప్పు కొంటానికి మాస్టర్లకు అవకాశం లేదుగదా! ఏం చెప్పాడో మరి. కమిటీమెంబర్లలో ఒకాయిన, వైశ్యకుల శిరోమణి ఒకనాడు స్కూలుకు వచ్చి, ఎవరంటీ ఆగునవ' అని అడిగాడు. పైనజెప్పిన విషయాన్ని పురస్సరంగా తీసుకొని హెడ్‌మాస్టరు

గారు నేను నాలుగోఫారంలో ఉన్నానని చెప్పి దారిచూపి ‘ఏదో పరాభవం అవుతుందిలే” అని మనస్సులో అనుకొన్నాడట.

నేను గ్లోబును బల్లపైన పెట్టుకొని జాగ్రఫీ బోధిస్తున్నాను. క్లాసుకు బైట రెండునిమిషాలు నుంచుని విని లోపలికి రాగా, పోనీలే అని నేనూ మర్యాదచేసి మాట్లాడినాను. ఆయన ధుమధుమలు మిటమిటలు ఆయన నాలో ఏదో తప్పు పట్టుకోవాలెనని భగీరథప్రియత్నాలు చేస్తున్నట్లు స్పష్టంగా చెప్పినవి. అటుచూచి ఇటుచూచి ఏమీ తోచక ఏదో అప్రియత్నంగా ఆగ్లోబుపైన చెయ్యివేసేసరికి అది గిర్రున తిరిగింది. వెంటనే ఆయన నిప్పులు గ్రక్కుతూ, ‘ఆహా! అయిందీ, దీనిమేకులు ఊడగొట్టి ఇది పాడుచేశావే’ అన్నాడు. గ్లోబు గుండ్రంగా తిరగటం మూలాన అది పాడుఅయిపోయింది, మేకు లూడినయి అనుకొన్నాడు పాపం మానవుడు. నేను కాస్త హాస్యరసపిపాసాబాధితుడ్ని కాబట్టి, విచారం అభినయించి, ‘అయ్యా, మీరు క్షమించాలి. ఏదో పొరపాటు జరిగింది. హెడ్‌మాష్టరుగారు మొన్న సెక్రిటరీగారు వచ్చిపోయిన దగ్గరనుంచీ అసలే కోపంగాఉన్నారు. మీరు ఈవిషయం ఆయనతో చెబితే నాకు తీరని కష్టం వస్తుం’ దని చేతులు నలుపుకొంటూ దీనంగా అన్నాను.

ఆకమిటీ మెంబరుగారు నన్ను సాధిద్దామన్న ఆగ్రహంతో ఉన్నారు కాన ఏమాత్రం కరుణచూపక ఆగ్లోబును పట్టుకొని సరాసరిని పెద్దమాష్టరు గదిలోకి చిందులు త్రొక్కుకుంటూ

పోవటం చూచాను. ఆయన మళ్లీ దిగిపోవటం నేను చూడ లేదు గాని హెడ్‌మాష్టరుగారు సాయింత్రం నన్ను కలుసు కొని విరగబడి నవ్వుతూ, ‘ఏమోయి, నీవు అల్లరివాడివోయి !’ అని చెవికొన గిల్లాడు. ‘మర లూడతయండి ! ఊరుకోండి మ్మాస్టారు !’ అని నేను అన్నాను. ఆయన మళ్లీనవ్వాడు.

మా అధికారివర్గములో మాస్కూలు గడియారాన్ని కూడా చేర్చకపోతే, ఆవిడగారి నిరంకుశప్రభుత్వానికి నేను ఆహుతి అయిపోతానని భయంవల్ల చేరుస్తున్నాను. ఏదో విధంగా ఆ అధికారులను పెట్టే సంకటాలనుండి బైటపడవచ్చుగాని, అచేతనమైకూడా చేతనమైన జీవరాసులలో అగ్రస్థానంపొందిన మానవులలో గౌరవపాత్రులమైన ఉపాధ్యాయులమైన మాకు కాలనిర్ణయం చేయటంలో మహాగురువువలె పెద్ద ఉప దేష్టలాగ పన్నెండుముఖాలతో ప్రత్యక్షమౌతుంది రోజూను మా స్కూలుగడియారం. ద్వాదశరాసులను గుణించి గ్రహ బలిమిని గట్టి అనుక్షణంకూడా మామా జాతక భావాలలో విపరీతమైనట్టి మ్లేచ్ఛసంపర్కాలు కలిగించి పొడుగుపాటి ముక్కులతోను, కదించుకపోయిన దృష్టితోను, మటమట లాడే ముఖాలతోను, చిన్నచిన్న కాగితపుముక్కలమీద విషలిప్తమైన ప్రశ్నలతోను మాకు దినం దినం బాలారిష్ట అపమృత్యుదోషములు కలిగించే ఒకదాన్ని ఒకటి తరుముకు పోయే రెండుముళ్లతో నిర్మింపబడిన ఓయంత్రరాజమా ! ‘ఏవం సతత యుక్తాయే భక్తాస్త్వా పర్యుపాసతే.’

నాశనము లేనట్టియు అక్షయమైనట్టియు ఆయంత్రమును ఉపాసనచేయు మాపై దానికి కరుణలేదు. మాగడియారాలను

తలదన్ని ఊళ్లో ఉన్న ఇతర గడియారాలను తిరస్కార భావంతో తృణీకరించి స్వేచ్ఛాగతిని విహరిస్తూ ఉండటమే కాకుండా ఉత్తమభర్తుడనో నెత్తిమీదతన్నే పూజారనో మాహెడ్‌మాష్టరుగారి ఇష్టాన్ని అనుసరించి ఆయన ఆల స్యంగా వచ్చినరోజున వెనక్కు రెండు అడుగులువేసి, పెంద లకడే వచ్చినరోజున రెండుఅడుగులు ముందు కేసి అనుకూల వతియైన భార్యలాగా ఆయన ఇచ్ఛానువర్తియైయుంటుంది.

సెక్రిటరీ కమిటీమెంబర్లు స్కూలుగడియారము కాక మాస్కూలు ప్యూన్‌కూడా మాఅధికారివర్గములో చేరినవాడే! అతని నల్లగడ్డం ఈ ఉడిగంలో తెల్లబడ్డది. కాబట్టి అతనికి స్థానబలిమి ఏర్పడి స్థాయిత్వం కుదరడమేకాక ఉపాధ్యాయుల పైన నేరాలు చెప్పటానికికూడా ధైర్యం సంపాదించాడు. అతనేకాక పెద్దమాష్టరుగారి బావమరది, కమిటీమెంబర్ల అన్నయ్యల బావమరదుల కొడుకులు మాకు అధికారులే. ఇం దులో ఎవరు తల్చుకొన్నా చాలు మాకొంప మునగటానికి.

ఇట్లా ఈపాఠశాల అనే సంస్థకు చెందిన ప్రతిమనిషీ నిరం కుశపరిపాలనకు సాధన మవుతున్నాడు. నిరంకుశ పరిపాలన పూర్వపు పద్ధతి కాబట్టి మాపరిపాలకవర్గము సనాతనధర్మా వలంబకులని చెప్పటమే నా యభిప్రాయంకాని మరొకటి కాదు. వారేకాదు. ఉపాధ్యాయులుకూడా మార్పుఅంటే ఇష్టంలేక సనాతనధర్మావలంబకులే. వారు ఉండేవి పాతపూరి కొంపలు. చెప్పేవి తాతలనాటి పాతకథలు. ధరించేవి పాతదుస్తులు.

పాఠశాలలో వున్న ప్రతివస్తువా కూడా ఈవిధంగా పాత
విషయాలందు అభిమానం కనపరుస్తు ఉన్నటువంటి సమయం
లో ఒక్క గోడలుమాత్రం దానికి భిన్నంగా ప్రవర్తిస్తవి. ఇక్క
డమటుకు ప్రాతవిషయాలకు చోటు ఏమాత్రంలేదు. ఏరో
జుకారోజు క్రొత్తవిషయాలు గోడలమీాది కెక్కుతవి. మాష్ట
ర్లకు పెట్టినపేర్లు, తిట్లు, కొందరివిషయమై వారికి కలిగిన అభి
ప్రాయాలు, ఇత్యాది సమస్తవిషయాలు ఏరోజు కారోజు
గోడలమీాద అచ్చుపడుతుంటవి.

# 7

## ఇరుగూ — పొరుగూ

ఉపాధ్యాయవృత్తి అన్నివృత్తులలోను ఉత్తమమైనది. దానాల అన్నిటిలోను అత్యుత్కృష్టమైన విద్యాదానం చేస్తూ ఒకరి కొంప తీయటానికికాని దొంగసాక్ష్యాలు సృష్టించి తెలివి అనే పదార్థంతో గారడీలుచేసి ఒకరికి అపకారం చేయటానికి గాని అవకాశం లేశమైన లేనిదీవృత్తి. అంతేకాకుండా అన్ని వృత్తులు ఉపాధ్యాయత్వానికి సాగిలపడి సాష్టాంగ నమస్కారం చేయాలిసిందే. ఎందుచేతనంటారా! ఉపాధ్యాయత్వంలేనిది వృత్తికి పుట్టుకలేదు. మిషన్‌కుట్టులో కూర్చుండి సూదులను అందించే కుర్రవాడికి గడ్డంసాహెబు గులామాలీఖాన్ గురువు. చిత్రికగుల్లపదునునూరే పిల్లవాడికి వడ్రంగి వీరయ్య ఉపాధ్యాయుడు. ఆసుపత్రిలో మందులుకలిపి రంగురంగు సీసాలలో పోసే ఆయనకు డాక్టరుయిచ్చిన చీటీగురువు. కాబట్టి సూక్ష్మంగా చూస్తే ప్రతివాడికి ఒకగురుస్థానం కనబడి అది ఆదర్శప్రాయమై, అనుకరణయోగ్యమై, పూజనీయ మాతుంది. మానవజాతికి ధర్మసూత్రాలు బోధించిన శాస్త్రకారులు గురువులు. వేదములు మానుషేయములే అయితే వేదకర్తలు జగత్ గురువులు.

ఇట్లు వృత్తులకెల్ల మూలాధారమై ఇందుగల దందు లేదను సందేహము వలదు అని చెప్పదగిన ఉపాధ్యాయవృత్తికి లోకం గోడలు కట్టి బడిపంతులలో ఇమిడ్చి వేయటంమూలాన నా

వృత్తికి వైశాల్యం కల్పించటానికి ప్రయత్నాలు మాని సంకుచితమై, రూఢమై, స్థిరమైన అర్థానికి కట్టుబడ్డ ఉపాధ్యాయునికి లోకంలో ఎట్టి విపరీతమైన పరాభవాలు, అగౌరవాలు, భక్తి పురస్సరాభినయాలు కలుగుతున్నవో, వాటిని గురించి నాకు తోచిన అర్థాలు నాకుకలిగిన ఆనందంతోసహా చూపి నా యందు సానుభూతినే మూర్తీభవింపజేసుకొన్న మీబోటి సహృదయులకు తెలియజేసుకొనే తృప్తికోసం మీఅధికారాన్ని వేడుకొంటున్నాను.

అయితే చదువరులైన విమర్శకశిఖామణులారా! నిశితమైన మీబుద్ధిని మొద్దుపోగొట్టుకొని, అర్థాంతరాలు కల్పించే మీధీవిశేషానికి మత్తుమందు వేసికొని, ఉత్తేజితమైన భావాలని వెతుక్కొనే మీజఠరాగ్నికి నావ్రాతను మంచుపానీయంగా ఎంచుకొని మీరు నాకు కలిగిన ఆనందాన్ని అనుభవిస్తూ, నా మాటలో మాటై నాఆత్మలో ఆత్మై నాఅనుభవంలో అనుభవమై ఉండాలని మనవి.

ప్రతిమానవునికి ప్రపంచములో ఇతరవ్యక్తులతో సంబంధం ఉండక తప్పదు. ఉపాధ్యాయుడూ మానవుడే కాబట్టి అతనికి మానవజాతికి జెందినట్టియు ఇరుగు పొరుగున నున్నట్టియు ఇతరవ్యక్తులతో సంబంధం కలిగినపుడు ఎట్టి విపరీతానుభవాలు కలిగినవో ముందు చెప్పదలుచుకొన్నాను.

మాపొరుగున వున్న ఒక పెద్దమనిషి యింటికి నేను ఒక రోజున వెళ్ళాలిసి వచ్చింది. ఆఇంటివసారలో చాలామంది స్త్రీలు కూర్చుని లంకాయోగమో కుచ్చులకథో మరి

కొంటున్నారు. వాళ్ళను చూచి లోపలికి పోవటానికి సందే హించి దూరంగా నుంచుని ఉండగా నాస్థితి వాళ్ళు గ్రహించి దిగ్గునలేచి లోనికి పోయినారు. అట్లా వాళ్ళు లేవటం నాగౌరవానికి ప్రణామాలని నేను లోలోన ఉప్పొంగి, అప్రయత్నంగా పొంగిన ఛాతీని ముందుకు తోసుకుంటూ రెండడుగులు వేసి ,, అమ్మా సుబ్బారావుగారు ఉన్నారా ? " అని అడిగాను. ఆమె, ,, లేరండీ " అని వినమ్రురాలై అధోముఖియై చెప్పింది ఆమె యీ కుర్రవాడికి, అంటే యీ ఉపాధ్యాయునికి చూపిన భక్తిగౌరవాలకు సంతోషించి ఇట్టిగౌరవాన్ని ఆకర్షించగల వృత్తికి ధన్యస్తోత్రము చేస్తూ, తిరిగి గుమ్మం దాటక ముందే, ఓస్, ఎవరో అనుకొన్నానే, నేను తహశీల్ దారో పోలీసుఆయనో అనుకొన్నాను. ఎవరో తెలుసునా? మన చంటివాడి మేస్టరు' అని అనటం నాకు వినిపించింది. ,,మేస్టరు అంటే అన్నది. చంటివాడు మేస్టరేమిటి ! " అని నొక్కి నొక్కి అనుకొంటూ నాకామాటలు వినిపించనట్లు అభినయాలు చేస్తూ చేతికర్ర వలయాకారంగా త్రిప్పుకొంటూ, ఇన్ని పరీక్షలు ప్యాసై ఇంతచదువులూ చదివినా పోలీసువాడికున్న గౌరవం ఉపాధ్యాయుడికి లేకపోయెనా అన్న విచారంవల్ల కుంగిపోయిన వక్షస్థలానికి కృత్రిమానందభిక్ష పెడుతూ అడుగులో అడుగు వేసికొంటూ వెళ్లిపోయినాను.

ఆడవాండ్లు సరే. ఆడదానిమాటకు విలువేమిటి అందాము. మొగవాండ్రు పెద్దమనుష్యులు, మంచిచెడ్డ తెలిసి పదిమందిలో తిరగనేర్చినవారుగదా ! ఒక పల్లెటూరు పెద్దమనిషి మా

యింటిపక్కన ఉండేఆయన ఒకరోజున వచ్చి నన్ను కలిసికొని "అయ్యా, మాఅబ్బాయి ఎట్లా చదువుతున్నాడండి" అని అడిగాడు. తల్లితండ్రులు అట్లా అడిగినపుడు తగిన సమాధానం చెపటం ఉపాధ్యాయునివిధి కాబట్టి వారిని కూర్చోమని గౌరవించి, మార్కుల రిజిష్టరు తెప్పించి చూడగా, నాకు ఆకుర్రవాడికి వచ్చిన మార్కులు చూచేసరికి పరమానందం గలిగి, నాక్లాసు కుర్రవాడు నాశిక్షణలో నున్నవాడు ఇంత తెలివితేటలతో ఉన్నాడను సంతోషంతోను, దానివలన నాకు ప్రతిఫలరూపముగా తండ్రినుంచి రాగల గౌరవ కృతజ్ఞతలున్ను ఊహించుకొంటూ అప్రయత్నంగా "గుడ్" అని అన్నాను. ఆయన తెల్లపోయి ఎందులోనండి అన్నాడు. "అన్నిట్లోను" అన్నా, నేను ఆయనవంక నిదానంగాచూస్తూ. ఆయన ముఖరేఖలలో మార్పు లేకపోవడంచేత కృతఘ్నుడని నిశ్చయించుకొని అక్కడ ఉండటానికి ఇష్టంలేక వెళ్లిపోతుంటే ఆయన పెదవులు విప్పి ఒక్కమంచిమాట మాట్లాడకపోవటం సరిగదా, మేకులాగ నుంచుని ఉన్నాడు. నేను గుమ్మం దాటినతరువాత పక్కవాళ్ళతో, ఆయన "పైగా ఎందుకట్లా నావంక చూస్తాడు ఆయన, తనేదో మహా ఘనకార్యంచేసినట్లు! అన్నిట్లో గుడ్డుఅయితే ఈయన చేసిన ఉపకారం ఏమిటి, నెలనెలకూ అయిదు రూపాయలూ తినటం తప్పితే?" అన్నాడట.

అతనికంటె ఘనుడు మల్లయ్యశ్రేష్ఠి మావీధిలోని యింకో పెద్దమనిషి అయిదోక్లాసులో ఫెయిలు అయినాడు అతనికి మా

రుడని ఆయనకు కోపంవచ్చింది. డిక్టేషన్‌లో తక్కువ మార్కులు రావటం కారణంగా అతనిని అయిదోక్లాసులో అట్టిపెట్టాము. ఆరోజు సాయంత్రం కుర్రాడితండ్రి కొండ్రి మూర్తియ్య వచ్చి, ,, ఏమయ్యా, మాఅబ్బాయిని తప్పించావట. ఎంచేత ? " అన్నాడు కారాలు మిరియాలు నూరుతూ. ఆయన వైశ్యుడు స్కూలు కమిటీలో ఒకడు. అందుచేత ఆయనకు విషయం నచ్చచెప్పాలిసిన అవసరాన్ని అవలంబనంగా చేసికొని ' అయ్యా మీరు వర్తకులుగదా ! మీ అబ్బాయి రేపు బేరాలు చేస్తుంటే సరిగ్గా పద్దులు వ్రాయవద్దా ! అవే ఇక్కడ నేర్పుతున్నాము. మాటలు తప్పు లేకుండా వ్రాయగల అక్షరజ్ఞానం మీవాడికి రాలేదు. అందుచేత తప్పించాము ' అన్నాము. ,, ఏమాట తప్పువ్రాశాడండి " అని ఆయన అడిగాడు. ,, చింతపండు " అనేమాట ' శింతపండు ' అని వ్రాశాడండి అని చెప్పి ఆయన సానుభూతిని ఆమోదాన్ని కోరే ఒక చిరునవ్వు నవ్వాను. ఆపెదవులపై చిరునవ్వు ప్రతిఫలించకపోగా, విసుగుతో ముడుతలుపడ్డ ముఖంతో ఆయన ,, ఓస్ ఇదేంటయ్యా, నేనేమిటో అనుకొన్నాను ! చింతపండు అంటె నేమి ? శింతపండు అంటేనేమి ? దాని పులుపు విరిగిందా ? ధరతగ్గిందా ? చాలుచాలు. చింతపండు అని వ్రాయాల, శింతపండు అని వ్రాయరాదు అని ఎత్తిపట్టింపులు పెట్టుకోక, పైక్లాసులోవేసి, డోకరాలు కట్టడంనేర్పి కాస్త లెక్కడొక్క గట్టిచేయండి. " అని హితబోధ చేస్తుంటే, నా ఉద్యోగం నిలుపుకొనేందుకు నేను తలయూచి, ' చిత్తం ' అనాలిసొచ్చింది.

పాఠశాల పరిపాలక వర్గంలో అట్టి అజ్ఞానులు ఉంటారాన్న సందేహాము ఉదాసీనత మీకు కలుగుతుందేమో ! తాలూకా పాలకసంఘానికి ఒకమాటు ఆరోగ్యవిషయమై అధికారి వ్రాసిన రిపోర్టులో కలరావల్ల చావులు నూటికి 12.7 అని ఉంది. ‘పన్నెండుచుక్కఏడు’ అంటే ఏమిటో ఒకళ్ళకూ అర్థంకాలేదు. పొరపాటున పడ్డదనుకొందామా అంటే నూటికి 127 గురు చచ్చారని అర్థం వస్తుంది. ‘మరుపుదట్టిన కాలంపు మడతలందు పాడు వడినట్టి’ వారిలెక్కల పరిచయమును త్రివ్వి పైకెత్తారు. ఆ ప్రయత్నంలో బుర్రలు గోకటంమూలాన పుండ్లు పడితే పడ్డయ్యేమో కాని అర్థంమాత్రం స్ఫురించలేదు. చివరకు ప్రక్కనే ఏదో పనిచేసుకొంటూ ఇదంతా, వింటూనే విననట్లు నటిస్తూ “నన్నడిగితే ఏంజెప్పేదిరాబాబూ” అని ఆలోచిస్తున్న ప్రెసిడెంటువద్దకు ఈ కఠినసమస్యకు సమాధానం కోసం వెళ్ళారు. ఆయన ఒకమాటు చూచి నీరసంగా నవ్వి, “యీచుక్కేమిటనా మీ గొడవ? ఏమిలేదు. కలరావల్ల నూటికి 12 గురు చచ్చారు. ఏడుగురు చావటానికి సిద్ధంగా ఉన్నారు.” అనిచెప్పి “ఆమాత్రం దాని అర్థం తెలుసుకో లేనివాళ్ళు తాలూకాబోర్డు మెంబర్లు ఎట్లా అయినారయ్యా” అని నాలుగు చీవాట్లు వేశాడు. పాపం వాళ్లు నాలిక కొరుక్కొని, “ఆసలు ఆయనను ఎందుకు అడిగాము? ఏబడి పంతులునైనా అడగవలసింది. లేకపోతే మనమే పరిశోధన చేయాలిసింది” అని నొచ్చుకొన్నారు.

ఈ పరిశోధకులలో, కుర్రవాడు ఇంటికి ఏడుస్తూ వస్తే, “ఎందుకురా నాయనా ఏడుస్తావు” అని అడిగి “మామా స్ట

రుగారు చైనా ఎక్కడుందని అడిగారు, నేను చెప్పలేకపోయి నాను. అందుకని కొట్టారు" అని కుమారుడు చెప్పిన జవాబువిని జాలిపడి, 'నాయినా, ఇక్కడనుంచి ఏది ఎక్కడ పెట్టిందీ జ్ఞాపకం ఉంచుకో యేం' అని కన్నకడుపుగల సహజ మైనప్రేమతో ప్రబోధము కావించిన తండ్రినికూడా మెంబ రుగా చేర్చుకోండి అని నా ప్రార్థన.

అయితే పల్లెటూరి పెద్దమనిషి, పొరుగింటి మల్లయ్య బోర్డు మెంబర్లు అయిదు బళ్లూ రాని అధికారులు. వారి మాట లెందుకు? ఆంగ్లవిజ్ఞానసంపన్నులై న్యాయవాదులూ తత్సంబంధమైన వృత్తిలో ఉండేవారు చదువులలో సమానమైన ఉపాధ్యాయుడ్ని గౌరవిస్తున్నారా? అంటే అదీనున్నే!

బడి విడవడంతోనే, అసలు నేను సరాసరి ఇంటికెళ్లి పిల్లవాడ్ని ఎత్తుకొని కాలం పుచ్చుకొంటానుగాని ఒకక్లబ్బుకు గిబ్బుకు వెళ్ళేవాడ్నికాదు. ఒకరోజున కర్మంజాలక వెళ్ళాను. నాతో చదువుకొన్నవాళ్ళు, ఇంకా ఇతరస్నేహితులు అక్కడ వున్నారు నన్నుచూచి ముసిముసినవ్వులు నవ్వుకొన్నారు. ఎప్పుడూ రానివాడ్ని వచ్చానని నవ్వుకొంటున్నారని నాలో నేను సమాధానం చెప్పుకొని ఊరుకొన్నాను. అందులో ఒకాయన "ఉపాధ్యాయుడంటే ఎట్టిలక్షణాలు కలవాడు" అని నిర్వచనం అడిగాడు. నాకు మాట్లాడటానికి అదను దొరికింది. నాకున్న శాస్త్రజ్ఞానాన్ని చూపడానికి దొరకిన అవకాశాన్ని పోగొట్టుకోకూడదని అనుకొని, L. T. క్లాసులో చదువుకొన్నదంతా తవ్విపోసికొని "ఉపాధ్యాయుడు జ్ఞాన

సంపన్నుడుగాను, దయాసముద్రుడుగను, శాంతుడుగను, దాంతుడుగను జితేంద్రియుడుగను ఉండా " లని ఏమేమో రత్నాలలాంటిముక్కలు అని, నేనూ అటువంటివాణ్నే అని వాళ్లు అనుకోకతప్పదుగదా, వాళ్లస్మృతికి అన్యాయం అసత్యం ఆయువుపట్లు మంచిముత్యాలు రత్నాలలాంటి సుగుణాలే ఉపాధ్యాయుని ఆయువుపట్లు, అని ఆనందపరవశుడ్నైఅయి నిమీలిత నేత్రాలతో వాళ్లవంకచూస్తూంటే, అందులో ఒకాయన వికారంగానవ్వుతూ, నావళ్లు మండుకొస్తుంది ‘‘ మాస్టారూ, అది కాదండీ. స్వాభిప్రాయము ( a will of his own ) ఎవరికైతే ఉండదో అతడే ఉపాధ్యాయుడు. where as cattle are not teachers పశువులు ఉపాధ్యాయులుకానేరరు. ఎందుకనగా అవి ఒకప్పుడు కాకపోతే మరోప్పుడైనా, స్వంతఇచ్ఛను, స్వాభిప్రాయాన్ని కనపరుస్తవి " అనిచెప్పి పైగా నావంక, నిజమా అబద్ధమా అని వెయ్యికంఠాలతో అడిగేచూపులు చూస్తూ, ఆచూపులకు తోడుకోసం కాబోలు నవ్వుదొంతర్లను వదిలాడు. వాళ్లు తెరలుతెరలుగా నవ్వారు. నాముఖం చూడను ఊఁ నవ్వను. ఒక్కొక్క నవ్వుతెర నాముఖంలో ఉండే ఒక్కొక్కజీవకళను తినేసింది.

ఇట్టి అపూర్వపరాభవాలు పొందుతూకూడా తలమెత్తుకొని తిరుగుతూవున్న ఉపాధ్యాయుని సహనము మొదలుగాగల సుగుణాలను గౌరవించే మంచిరోజులు రాకపోతయ్యా అని నిరీక్షిస్తున్నాను.

# 8

## ఇంటా—బయటా

ఉపాధ్యాయుడికి ప్రపంచములో ఉండే వ్యక్తులతోడి సంబంధాన్ని గురించి వ్రాయదలంచుకొన్నాను. కాబట్టి ఇరుగుపొరుగునా కలిగే మర్యాదలతో ఆపటానికి వీలులేదు. ఇంటా, బయటా కూడా ఉపాధ్యాయునికి ఎట్టి అపూర్వమైన మర్యాద కలుగుతున్నదో చూపదలచుకొన్నాను.

అయితే ఒకసంగతి. నాకీ అపూర్వ అనుభవాలను పరాభవాలను కల్పించిన వ్యక్తులలో మీరూ ఏకమై నన్నుజూచి నవ్వాలని సంకల్పించుకొన్నారా? నేను ఈవ్యాసంలో ప్రతి అక్షరంలోను ప్రాణప్రతిష్టచేసి ఊదిఉంచిన మంత్రప్రాబల్యం చే అట్టి వక్రభావం, మీమనస్సులోనుంచి మీదృష్టిలోనికి మళ్ళేటప్పటికల్లా ప్రతిఅక్షరం తన రూపంలోని వంపులనుకుదించుకొని పూర్ణానుస్వరరూపాన్ని పొందుతుంది. మీకు అపుడు కనుపించేది ఒక్కబిందురూపమే. కాబట్టి అనవసరంగా అవమానాన్ని ఆహ్వానం చేసుకోకండి — అని నామనవి.

ఇంటాబయటా అనటంలో నాఉద్దేశం ఉపాధ్యాయుడికి ఇంట్లోనుబయటాఅంటే ఇల్లుదాటినతర్వాత ఎక్కడనైనాసరే స్కూలులోగాని తదితరచోట్లగాని కలిగే మర్యాదనుగురించి వ్రాయటమే.

మొదటి రెండుమూడు విషయములు మాకుర్రవాళ్లను గురించి చెప్పుతాను. కళ్లుమూసుకొని పాలుతాగుతూ, తన్నెవరు చూడలేదని అనుకొనె మార్జాలమానసికతత్వంతో తూకంలో సరిపోయే ధీశక్తిభారంగల మాకుర్రవాళ్లకు పాఠశాల తెరచినరోజునే సరిగ్గా అందరికి ఆరోజునే, ఒకడికి అవసరమైన పని ఒకడికి కడుపునొప్పి ఒకడికి గ్రహణిబాధ వస్తూఉంటవి. అంతేకాక మాముసలమ్మ చచ్చినదనియొకడు మా యింట్లో చిమ్మిరితొక్కుతారని ఒకడు, మాఅక్కయ్యపెండ్లివలన బాధపడుతుందని ఒకడూ వ్రాస్తూఉంటారు. మేము వాటిని అందుకొని మామూలుగా మంజూరుచేస్తూఉంటాము. అట్లా సెలవుచీట్లు పంపిన విద్యార్థులు అట్లావ్రాసిన తల్లిదండ్రులూ లేకపోతే ఏబాబాయిగానో దస్కతుపెట్టిన ధర్మబుద్ధులైన పెద్దమనుష్యులు ఈమా అనుభవాన్నిచదివి తమఉపజ్ఞకు ఆనందపడి తమ తెలివితేటలకు తాముగా ధన్యాభివాదములు సలుపుకునేచదువరులూ మమ్ములనుగురించి తక్కువగా యోజించటం ఎంతో పొరపాటు అన్నవిషయం గ్రహించటం తమ ఆనందావేశాన్ని మరచిపోకండి.

మొదటి విచిత్రానుభవం నేను పిల్లవాళ్లకు ఆర్యులను గురించి చెప్పినఒకపాఠంలో సంబంధించినది. ఆర్యుల ఆహారము ఆచారభోజనాది విషయమునుగురించి వారి రాజకీయ సాంఘిక మతైకసంస్థలనుగురించి బోధించి మున్నాడు ఆపాఠం మీద ప్రశ్నలువేస్తూ ఆర్యుల ఆహారమేమి? అనేప్రశ్న క్లాసుమీదికి విసిరి నేను ఇంతవరకు విన్నకుండి ప్రభువులను

మధ్యవరగణాలలోని వాకటులతో ముడిపెట్టుతున్నానుగదా ? అట్లయితే ,, అగ్నిష్టోమాప్తోర్యామోక్థ షోడశ్యాతి రాత్రి వాజపేయ బృహస్పతి సవనాద్యస్కర చతురశ్వమేధ యాజనః ' అని శాసనము తెలుపుతూవున్న మొదటి ప్రవరసేనునికి దక్షిణాదికి సంబంధించిన శ్రీశైలమందున్న శ్రీపర్వతస్వామి ఇష్టదైవ మెట్లయినాడు. వాకటులది అసలు దక్షిణామైయుండి ఉత్తరమునకు పోయియుండిరా ? లేక ఒకశాఖ ఉత్తరములోను మరియొకశాఖ దక్షిణములోను పాలించినారా ? కేవలము జౌత్రాహులే అయితే వారి శాసనములు ఏలూరు పెందులూరు అమరపురంలో ఎట్లాదొరుకుతవి ? ఈఅమరపురం ఎక్కడుంది ? గుంటూరుజిల్లాలోని అమరావతినే అమరపురంగా చేయటానికి సాధనమేమైనా ఉందా? అని తీవ్రమైన ఆలోచనలో నుండగా ఒకకుర్రవాడు ఆర్యుల ఆహారము పాలు పిండి దుంపలు అనిచెపుతూఉంటే నేను గోళ్లుకొరుక్కుంటూ నాఆలోచనలో మునిగి వాడిమాటలు వినిపించుకోకుండా ,, ఇంకా, ఇంకా " అన్నాను. ఆకుర్రవాడు మళ్లాకాయలు పండ్లు, మాంసము సోమరసము అనిచెప్పినా నేను ,, ఇంకా ఇంకా " అనటంచూచి ,, గోళ్లు " అన్నాడు. ఆమాటవిని నేను ఊహాకన్యల ఆలింగనంలోనుంచి ఉలిక్కిపడి చూచేసరికి క్లాసు అంతా నవ్వుతున్నారు. నాచేతిగోళ్లు ఇంకా పండ్లసందులలోనే ఉన్నవి. ఆకుర్రవాడికళ్లలో నూతృం కార్తికజ్యోత్స్నలు వెలుగుతున్నవి. ఏమిచేసేది ? నవ్వి ఊరుకొన్నాను.

పూర్వమొక ఉపాధ్యాయుడు భూతదయమీద పాఠం చెప్పి సమస్తజీవులయందును భగవంతుని అంశఉందనీ సృష్టి

అంతా శ్రీభగవానుని లీలయని ఏజీవియందుగాని కాఠిన్యము పూనక సోదరభావముతో చూడాలనే విషయాన్ని నీతిపురస్సరంగా బోధించి బోధనాపద్ధతులను అనుసరించి ప్రశ్నలరూపంగా వాళ్లభావనాశక్తికి ఉత్తేజం కలిగించాలని,

“ ఒరే అబ్బాయి ! ఒక చాకలివాడు ఒకగాడిదను చావగొట్టుతుంటే నేనువెళ్లి ఆగార్ధభాన్ని రక్షించాను. అప్పటి నాపరివర్తన ఎట్టినీతిని అనుసరించిందని నీవు విమర్శిస్తావు ” అని అన్నాను జీవకారుణ్యము చూపులలో బుద్ధదేవుడిలాగ ప్రవహింపచేస్తూ. అప్పుడు ఆక్లాసులోఉన్న ( ఒకపోడుగాటి కురవాడు అయియుంటాడు ) ఆబ్బాయి ఒకడు చప్పునలేచి ధైర్యంగాను స్పష్టమైన గొంతుకతోను “ సోదరభావంతో పరివర్తించారండి ” అని తడువుకోకుండా అనేశాడట.

ఇట్టి విచిత్రానుభవాలు మీకేవస్తవి అనిఅదిఒక లోపంగా భావిస్తారేమో! దొరలకుకూడావున్నవి. ఇట్టివిచిత్రానుభవాలు అచ్చు పుస్తకాలలోకూడా పడ్డవి. ఒకదొర ఉపాధ్యాయుడు భూమి గుండ్రంగాయున్నదని ఎంతబోధపరచినా బాలురకు జ్ఞాపకం ఉండకపోవటంచేత పరీక్షాధికారివచ్చి భూమి ఏఆకారంలో ఉందనిఅడిగితే వాళ్లుతప్పక తెల్లముఖాలువేస్తారని భయపడి వాళ్ల జ్ఞాపకశక్తికి అవలంబనగా వుండటానికని,, ఒరే అబ్బాయి భూమిఇదిగో ఈపొడుముబుర్రలాగ గుండ్రంగా వుంది. రేపు పరీక్షవంతులుగావొచ్చి మిమ్ములను ఆప్రశ్న అడిగితే నాపొడుముకాయ జ్ఞాపకంతెచ్చుకొని గుండ్రంగావుందని

చెప్పండి " అని నచ్చచెప్పినాడు. ఆయనననుకొన్నట్లే ఇన్స్పెక్టరువచ్చి భూమి ఎట్లావుందని అడగనే అడిగినాడు.

పిల్లలందరూ ఐక్యకంఠంతో ,, ఆదివారంనాడు నలుచదరంగాను మిగిలినరోజులలో గుండ్రింగానువుంటుం " అని అన్నారు. పరీక్షపంతులూ టీచరూ తెల్లపోయినారు. ఆదివారం రోజున నలుచదరమైన పొడుంకాయనూ ఇతరరోజులలో గుండ్రనికాయనూ ఉపయోగించే అలవాటు ఆఉపాధ్యాయునికి వుంది, అందుచే ఆకుర్రవాళ్లు అల్లాఅన్నారు.

కుర్రవాళ్లకూ, మాకు, పాఠశాలలో ఇట్టిసంబంధమున్నా బైట, వాళ్లుచూపించే ప్రేమవిషయమై నేను తల్చుకున్నప్పుడు మాత్రం నాహృదయం ఆనందముతో పొంగిపోతుంది. ఏకుర్రవానిని పిలిచి పనిచెప్పినా నామాట శాసనంగా గ్రహించి సంతోషంతో గంతులువేసుకుంటూ పనిచేస్తాడు. బ్రిటిషు సామ్రాజ్యాన్ని ఏలే చక్రవర్తికైనా అట్టి నౌకరులు ఉండరు.

ఒకమాటు నేనుఏదో తొందరపనిమీద గబా గబా నడుస్తూ వెళ్లుతుండగా వెనుకనుంచి ఒకకుర్రాడు ఎక్కడినుంచో ' సార్ సార్ ' అనుకుంటూ పరుగెత్తుకొని రావడంచూచి పాపము ఎందుకో అని ఆగాను. వాడురొప్పుకొంటూ నాయెదుట నిలవబడి విస్మయానందాలతో తలమున్కలైన నాతో వాడు ,, ఏమీలేదండి నమస్కారమండి సార్ " అని అన్నాడు. పిచ్చివాడు నమస్కారం పెట్టడానికి ఇంతదూరం పరుగెత్తు

కుంటూ వచ్చాడు. భక్తి అంటే అదే భక్తి అని సంతోషించాను.

వాళ్ళభక్తే కాకుండా వాళ్ళభయంకూడా అటువంటిదే. ఒకమాటు నేను చీకటిపడ్డ తరువాత ఒకవీధివెంట వస్తున్నాను. ఒకకాలుపొడుగు చిన్నవాడు సిగరెట్టునుకాల్చుకొని పొగపీల్చి విలాసంగా ఒదులుకుంటూ రావటం నాకళ్ళపడ్డది. నన్ను చూడడంతోనే వాడు దాన్ని మాయంచేశాడు. అయితే నేను వాడిని వదలలేదు. ,, ఏమోయి! ఇంతచిన్నవాడవే! అప్పుడే నీకు సిగరెట్లా? సిగరెట్లు త్రాగరాదని నీకుపాఠం చెప్పలేదటోయి! ' సిగరెట్లను బీడీలను త్రాగరాదు ' అనే పద్యం చిన్నప్పుడు నీవు నేర్చుకున్నావుకాదా! మళ్ళ ఇదేమి పని? " అని గట్టిగా చీవాట్లువేశాను. సిగరెట్లు త్రాగు అలవాటు నాకప్పటికి అలవడని కారణంచేత అంతధైర్యంగా అట్లా అనగలిగినాను.

నేనెంతచెప్పినా వాడు ,, నేను తాగటంలేదండీ, నేను తాగడంలేనండీ " అని అంటాడేగాని సిగరెట్టు పారెయ్యడే. చేతులో సిగరెట్టు కనబడుతున్నా ఇట్లా అంటావు వీడు! ఇదేమి పెంకితనమా? అని విసుక్కొని ఎప్పటికి బాగుపడుతావు? ఇంతనిర్భయంగా పెంకెగా కళ్ళతో నేనుచూచినవిషయాన్ని కప్పిపుచ్చాలని చూస్తావేమిరా? అంటేవాడు నామాట కొంసా కావిని ,,లేదండీసార్ నేనుతాగటం లేదండి? " అని మళ్ళా అనటం నాకు ఆశ్చర్యం కలిగించటమేకాకుండా వళ్ళు మళ్ళీ మం

డించడంమూలానవంచినచెయ్యిపట్టుకొని వేళ్ళచాటున దాక్కొని ఉన్నసిగిరెట్టును చూపి "ఇప్పుడేమంటావురా" అని అన్నాను. మాష్టరునుచూచినా ఆరిపోకుండా పొగను మేఘ మేఘాలుగా నానిజవదనం పై కిపంపుతూ తనజీవిత పరిణామానికి ఆటంకం కల్పించిన నన్నుజూచి కన్నెర్రజేసిన సిగిరెట్టుయొక్క నిర్భయాన్ని కొంత కొంత తనలో స్ఫురింపజేస్తున్న గొంతుకతో ఆకుర్రవాడు " అదికాదండీ, మాస్టారూ! ఈసిగరెట్టును మా అన్నయ్య కాల్చుకురమ్మంటే కాల్చుకు వెడుతున్నానండి" అన్నాడు. ఈవిచిత్రమైన జవాబిచ్చిన కుర్రవాడు ఎవరా అని మొఖంమీద ముఖంపెట్టి చూద్దునుగదా మాపాడుగాంటి కుర్రాడే.

ఉపాధ్యాయుడు ఇట్టి విపరీత అనుభవాలకు లోనవటం ఒక్కమానవవర్గంకు సంబంధించిన విషయాలలోనే కాదు. జంతువర్గ దేవవర్గకు సంబంధించిన విషయాలలో కూడా ఇదే జాతకం జంతువర్గలో అండజములు స్వేదజములుకూడా ఉపాధ్యాయునిచూచి భయపడవు. అందాక ఎందుకు మా దొడ్లో ఆవులు గేదెలు కర్రపుచ్చుకెళ్లినా నన్నుచూచి భయపడవు. మాపాలివాడు కర్రలేకుండా వెళ్లినా భయపడుతవి.

ఇక దేవవర్గంలోకి వెడితే యమధర్మరాజుదగ్గర జరిగిన సంగతి చెప్పవలసివస్తుంది. యమధర్మరాజు ఒకప్పుడు నిజ భృత్యవర్గాన్నిపిలిచి "మీరు ఇంతకాలంనుంచీ జీవులతో పరిచయంకలిగియున్నారు. ముఖంచూచికాని మాటలధోరణిని

బట్టిగాని ఏజీవి భూలోకంలో ఎట్టి వృత్తిలోనున్నది చెప్పగల రా " యని పృచ్ఛచేశాడు. భృత్యవర్గమంతా మౌనముద్ర వహించియున్న సమయంలో ఒకడులేచి " అయ్యా ! అది అంత కష్టపుపనికాదండీ. ఏజీవినైనా ఏమయ్యా నీవు ఎక్కువగా పాపంచేశావని నిర్ణయించి " నిన్ను తప్తతైలంలో పడవేయాలని ఆజ్ఞఅయింది " అంటే " చిత్తం " అనీ " నిన్ను ఉక్కుస్తంభానికికట్టి కీలుకీలుమీద వాతలువేయమన్నారు " అంటేమళ్లీ అతడు " చిత్తం " అని అన్నాడా అతడు భూలోకంలో తాలూకా గుమాస్తా పనిచేశాడని గ్రహించాలనీ లేకపోతే మాట్లాడుతూ మాట్లాడుతూ చాలాసార్లు " తెలిసిందా" బోధపడ్డదా ? " అని అన్నాడా అతడు ఉపాధ్యాయుడని గ్రహించవలె " నని అన్నాడు. ఆభటుడు మాపాడుగాటి స్వరూపముయొక్క తద్భవమేమో అనుకొంటాను.

అపుడు యముడు ఒకఉపాధ్యాయుడిని పిలిపించి సంగతి సందర్భాలు కనుక్కొందామని " ఏమయ్యా ! నీకు ఇక్కడ ఎట్లాఉంది ? " అని అడిగినాడు. అజీవి " అయ్యా ! మీ భటుల దౌర్జన్యం దుర్భరంగా ఉంది. వారిలో మానవత్వం పూర్తిగానశించి కాఠిన్యం నిర్దయ క్రూరత్వము దౌష్ట్యము... అని సాగించిన ఉపన్యాసం వినిపించుకోకుండా యముడు " అది కాదయ్యా వాళ్లు మీకు వేళకు తిండితిప్పలు సరిగా..." అని ఏమో అనబోతున్న యముడ్ని ఉపాధ్యాయుడు ఉరిమి చూస్తూ చెప్పేదికొంసాకువిను. వేళవప్రశ్నలూ నీవును చివరంటూ

విని తెలియనిదేదైన ఉంటే నిల్చుని అడుగు తెలిసిందా ?"
అని అభ్యాసప్రాబల్యంచేత అప్రయత్నంగా అన్నాడు.

నిశితమేఘాకృతిగల యముని వదనముపైని నవాషా
ఢపువినీలభయదభీకర జీమూతహృదయంను చీల్చుకొనివచ్చిన
క్రొమ్మెరుంగులాంటి చిరునవ్వు మెరసినది. ఆయన . సంతో
షించి ప్రొద్దుగూకులూ యమలోకబాధలుపడ్డ జీవులకు ధర్మా
లుబోధించటానికి యమలోకచరిత్ర చెప్పటానికి ఒక నైటు
స్కూలుపెట్టి ఆతనిని ఆఉపాధ్యాయుడుగా నియమించినాడు.

ఉపాధ్యాయునికి బైటప్రపంచకంలో జరిగే అనుభవా
లనుగురించి ఎంతైనా వ్రాయవచ్చు. కాని ప్రస్తుతం ఇక్క
డికి ఆపి ఆయనకు ఇంట్లోగలిగే గౌరవాన్ని గురించి తెలుసు
కొందాము.

"మాతా పుత్రత్వస్య భూయాంసి కర్మాణ్యారభతే,
తస్యాం శుశ్రూషా పతితా యామపి" అనే ఆపస్తంబునిసూ
త్రాన్ని హృదయనాళాలకు ముడివేసికొని భార్యావిధేయుడై
ఉండుటయేకాకుండా "ఉపాధ్యాయాద్దశాచార్య, ఆచార్యాణాం
శతం పితా పితుర్దశగుణం మాతా గౌరవే ణాతిరిచ్యతే"
అన్న గౌతమసూత్రాన్నికూడా వల్లించుకొని నాకంటే అంటే
ఉపాధ్యాయునకంటె తల్లిఅంటే నాపిల్లలతల్లి ఎక్కువ గౌర
వింపతగినదని భావించి సేవిస్తున్న నాకు ఆమెవలన కలిగినగౌర
వాన్ని గురించి మనవిచేసుకొంటాను.

మేము పెద్దవాడలో కాపరంచేస్తున్న కాలంలో మాయిం టిపక్కన ఒక సబురిజిష్ట్రారు ఉండేవాడు. ఆయనభార్యకూ మాపిల్లలతల్లికి స్నేహంకుదిరింది. ఆవిడ డబ్బువిస్తారం ఖర్చు చేస్తూ తనయిష్టమువచ్చిన వస్తువల్లా కొనుక్కోటంచూచి మా మనిషి, ' నీకు ఇంతడబ్బు ఎక్కడనుంచి వస్తుందని అడిగిందట. అప్పటికి మామనిషికి బొత్తుగా చిన్నతనం అనటంవల్లా ఆలాగ అల్లా అడిగింది. రిజిష్ట్రారుగారిభార్యకూ చిన్నతనమే. ఆమె " మగాళ్ల జేబుల్లో రూపాయలుంటాయి. అవి మనకియ్యరు ఆఫీసునుంచి ఇంటికిరావటంతోనే కోటువిడిచేటప్పుడు తలుపు చాటున నుంచుని కనిపెట్టి జేబులోగలగలలాడటాన్నిబట్టి వస్తు నిర్ణయాన్ని చేసికొని ఆయన కాఫీ తాగటానికి వెళ్ళగానే జేబు లోచెయ్యిపెట్టి ఒకటో రెండోతీసి దాచెయ్యాలె. ఆలస్యం చేస్తే కార్యం చెడుతుంది. పెట్టెలోదాచేస్తారు సుమా! " అని హితబోధ చేసిందట.

మాపిచ్చిది సంతోషించి మర్నాడుసాయంత్రం నేను కోటువిడవటం కనిపెట్టింది. జేబులో గలగలలాడినవి. దొంగ తనంచేయరాదు అని రెండోచెవికి వినబడకుండా అరుస్తున్న అంతరాత్మ గొంతు గట్టిగా నొక్కిపట్టి, సిరి తనంతతానరించిన్ మోకాలడ్డుదురే ' అనే పద్యాన్ని జ్ఞాపకంచేసుకొని నేను ఇంతలో స్నానానికి వెళ్ళటంమూలాన దొరికిన అవకాశంవల్ల పుట్టిన అవకాశాన్ని ఊతగాగైకొని ధనలక్ష్మితో చేయిచేయి కలుపుకొంటానికి వెళుతున్నానుగదా సంతోషంవల్ల తన్మయ త్వంవల్ల ఊగిపోతూ గాంగునుడులాగ కాళ్ళుఅందేలచప్పుడు

కాకుండా సవరించుకొని మెల్లగా జేబులో చెయ్యిపెట్టి ఇట్లా పొడుగ్గావున్న వేమిటబ్బా ! అని రెండు తీసిందట. పాపము సీమసున్నపుముక్కలు అవి !

ఆరోజు ఆమె ముఖముపైన ఏర్పడిన భ్రుకుటిమా, విషాదచ్ఛాయలూ, దానితరువాత నేను యీమాష్టరీవృత్తిని గురించి ఎన్నిఉపన్యాసాలిచ్చినా దానిఉత్కృష్టతనుగూర్చి ఎంతబోధించినా విడిపోలేదు, సరిగదా పైగా ఆవిడవల్ల బైటే కాకుండా ఇంట్లోకూడా ఏమిపాఠాలు చెబుతారు లెండి అని వెక్కిరింతలు తినాలిసివచ్చింది.

అంతటితో ఆగక స్కూలువిషయాలలోకూడా జోక్స్ ముకలుగజేసుకొంటూ అక్కడజరిగిన సంగతులను ఎప్పటి కప్పుడు పిల్లలమూలాన తెలిసికొంటూ నన్ను ఎత్తిపొడుపు లకూ వెక్కిరింతలకూ లోనగునట్లు చేసింది స్కూలులో ఏ అవమానంజరిగినా దాన్ని అపహరిగోడకు లోపుననేవదలి ప్రియసీప్రియవదనసందర్శనాభిలాషతో త్వరితగతిని ఇంటికి పోవటమే నాఅలవాటు. మామూలుగానే గబా గబా వచ్చే స్తున్నాను ఇంట్లోకి గడపలో కాలుపెట్టేసరికి నాభార్య Hold on అని కేకవేసింది. ఇదేమిటి ఎవరైనా కుర్రాడు ఇక్కడకుకూడావచ్చి అన్నాడా అని అనుకొని ఝల్లుమన్న గుండెను కుదటపర్చుకొంటూఉంటే ఆవిడ " ఇటుఇటు నేనే Right Right " అని పకాపకా నవ్వుకుంటూ పరుపుపై బడి దొర్లటం మొదలుపెట్టింది.

స్కూలులో బయలుదేరిన అల్లరి ఇంట్లోకి కూడా వ్యాపిస్తున్నదే. ఇక జీవించటం ఎంత దుర్భరమూ అనిపించింది. సంగతి ఏమిటంటే ఒకరోజున పాఠశాలాంతరపరీక్షకు పోయే బాలురకు నేను చరిత్రాత్మకమైన ఒకానొక విషయాన్ని చెబుతూ, తాత్కాలికముగా కలిగిన దేశాభిమానంతో కూడిన ఆవేశంతో ఒక్కగుక్కతో దీర్ఘసమాసాలు విసురుతూ మహావేగంతో పొయ్యే మోటారుబండిలాగ ఉపన్యాసాన్ని నడిపిస్తూ ఉంటే కుడివైపునున్న బెంచీలమీదనున్న కుర్రాళ్లల్లో ఎవరో Hold on అని పెద్దకేక వేశాడు. వాడు ఎవరో కనుక్కొని నలిపి మింగేద్దామన్న కోపంతో అటు తీక్షణంగా చూస్తుంటె ఎడమవైపునున్న బెంచీలలో ఎవరో వెనుకనుంచి Right Right అని కేకవేశాడు. ఈ రెండువైపులనుంచి వచ్చినశబ్దాలు నాగొంతునుపట్టుకొని మాటరానీయకుండా నొక్కేసినవి. నా తల గిర్రున తిరగటమే కాకుండా రెండువైపులా నాకా పొడుగాటి కుర్రవాడి స్వరూపమే ప్రత్యక్షమైంది.

మాఅబ్బాయికైనా తండ్రియందు తల్లియందు ఆచార్యునియందు గౌరవం గలిగిద్దామని మాతృదేవోభవ, పితృదేవోభవ అనే వాక్యార్థమును బోధిద్దామని నాయినా తండ్రి దైవము తల్లిదైవము అని నేర్పాను. వాడు అవి నేర్చుకొని కాసేపుండి,

‘ నాన్నా ! నీవు దేవుడివా ? ’

‘ అవును నాయనా. ’

‘ అమ్మో ?’

‘ అమ్మా దేవుడే.’

‘ అయితే నేనో’ అన్నాడు.

నాకేంచెప్పాలిసింది తోచిందికాదు. చివరకు నాయినా ‘‘ నీవు మంచిభక్తుడవు. అమ్మల్ని దగ్గరిని పూజసేయటానికి ’’ అన్నాను. మావాడు బిక్కమొఖంవేసుకొని ‘ కాదు నాన్నా. అమ్మాదేవుడూ నీవు దేవుడూఅయితే నేను చిన్న దేవుడిని నాన్నా ! ’’ అన్నాడు. వయస్సు యేడేండ్లయినా ఆలోచించేశక్తి ఉంది. కాబట్టి వీడుఇట్లాఅన్నాడని మాటలు వచ్చిరానిస్థితిలో ఉన్న మాఅమ్మాయిని పిలిచి ‘ అమ్మ దైవము, నాన్నదైవము ’ అని అనుమ్మా అని చెపితే అది పరుగెత్తుకుంటూ తల్లిదగ్గరకుపోయి ‘‘ అమ్మా, అమ్మా, అమ్మ దయ్యము, నాన్నదయ్యము ’’ అని చెప్పింది. ‘‘ఎవరు చెప్పేరే నీకు పాడుమాటలు ’’ అంటే పైగా ‘‘ నాన్న ’’ అన్నది. వాళ్లఅమ్మ ధుమధుమలాడుతూ నాదగ్గరకొచ్చి పసిదానికి ఏమిటా పాడుమాటలు చెబటం. వాళ్లకేంతెలుస్తుంది. ఏం అనమంటే ఆదే అంటారు. చాలులెండి మీరు చదువుచెబటం. ఎవరన్నా వింటే నవ్వుతారు. ఇకలేవండి’’ అని వెళ్లిపోయింది.

ఇక మామునలమ్మది అదోగొడవ. ‘ కాలవగట్టుల పైన గుమాస్తాపని అయినా సంపాదిస్తే ఈకరువుకాలంలో కాస్త కాయ, కూర, గడ్డి, గాదం దొరికేది, అని ఎప్పుడూ పోలశె

డుతుండేది. ఒకసారి నేను ఆమెతో అమ్మమ్మా! తొందరగా అన్నంపెట్టు ట్యూషన్ చెప్పుకుంటానికి పోవాలె ' అని అన్నంపెట్టించుకొని తినివెళ్లిపోయినాను. రాత్రి, నేనూ, నా. బావమరది కూర్చొని భోజనం చేస్తుంటె ఆమె ,, నాయినా! మనది నిక్షేపంలాంటి రాజపూజితమైన నియోగికుటుంబంగదా? షోడషం చెప్పుకొంటానికి నీకర్మం ఏంకాలిందిరా?. అంటూ మొదలుపెట్టింది.. ,, ఇదేమిటమ్మా. నేను షోడశం చెప్పుకొంటున్నానని నీకు ఎవరు చెప్పా " రంటే ,, నాయనా! నీవు పొద్దున అంటివిగదరా షోడశం చెప్పుకోవాలి తొందరగా అన్నం పెట్టు " మని అన్నది ట్యూషన్ అనేమాట ఆమె నోట్లో షోడశంకింద మారిందని నాకు విచారమూ, మాబావమరదికి నవ్వు వచ్చినవి. ఇంట్లోసంగతి ఇట్లావున్నది.

---

# 9

## మా — కష్టాలు

పిల్లలంటే ,, మాకుర్రవాళ్ళు అని యిదివరకే చెప్పు కొన్నాను. వాళ్ళెంతో పిల్లంతే. అంటే వాళ్ళెంతమమ్మ ల్నిసరిగా అర్థంచేసుకొంటున్నారో పిల్లు అంతే. వెనుకటికి ఒక యాచకుడు ఒక షాహుకారువద్దకువెళ్లి తను చదువుకొనిన విద్యనుగురించి చెప్పుకొని ఏదైనా యియ్యమని కోరినాడు. ఆవైశ్యరాజు ఆయనతో వాళ్ళకులంలో నాయకుడైన దివ్వేల జాలయ్యను ఉద్దేశించి, ,, ఆరింటికి వెళ్లొచ్చావా ? ఆడేమైనా ఇచ్చాడా " అన్నాడు. అక్కడ ఏదో ఇచ్చారు అంటే ఈయనకుకూడా యియ్యాలని బుద్ధిపుట్టవచ్చునని అనుకొని ,, ఆ " అన్నాడు యాచకుడు. వెంటనే సాహుకారు ఆయా చకుడు మళ్ళీ మాట్లాడకుండాఉండేటట్లు ,, ఆడిస్తే ఈడియ్యారు. ఆడియ్యకుంటే యీడా ఇయ్యరు " అన్నాడట. అట్లాగే మాజీవిత సందర్భములోకూడా వాళ్లు సరిగా మమ్మలను అర్థం చేసుకుంటే పిల్లు చేసుకోరు. వాళ్ళు చేసుకోకపోతే పిల్లూ చేసుకోరు, అదీ మాస్థితి.

మాకష్టాలను అర్థంచేసుకొనకపోవటం పిల్లల్లో. ముఖ్య లక్షణం. ఒకరోజున నేను క్లాసుకు వెళ్లాను. మామూ లుగా ఉండేవాళ్లుకాక క్లాసులో ఒకక్రొత్త మొఖం కనిపించింది. జీతంకట్టందే యేకొత్తకుర్రాడ్ని క్లాసులో కూర్చోనియ్యరాదు.

అట్లా కూర్చోనిస్తే మాకు తంటా. ఈసంగతి నేను మన స్సులో నుంచుకొని ' అబ్బాయి, జీతంకట్టి పేరు వ్రాయించు కొచ్చావా' అన్నా. వాడు ఆరంభంలో వినయంగా నేనిల్చుని ' లేదండీ' అన్నాను. అప్పటి వానిప్రవర్తన అనుమానింప వలసిన అవసరాన్ని కలుగజేయనందున ,,అబ్బాయి, మరి నీవు క్లాసులోనుంచి వెళ్లిపోవాల " అన్నా. వాడు మాట్లాడ లేదు, ఏమోయి నీకే చెప్పేది, వెళ్లాలె " అన్నా. వాడు మళ్ళీ అట్లాగే నుంచున్నాడు. తలవంచుకొని సూక్ష్మంగా చూస్తే వాడి వినయం నాధైర్యానికి కారణం అయిందో ఏమో ,, ఏమోయి, నీకే చెపటం. వెళ్ళకుండా అల్లా నుంచుం టావు ఎందుకు ? "

మధ్యాహ్నం జీతం కడతానండి. సార్. మధ్యా హ్నంకడితే మధ్యాహ్నమేరా. మరి యీపూట పాఠంపో దండీ. పోతే నన్నేమంటావు—నడూబయటికి. కాదండీ మాస్టారు, పాఠం పోతుందండి. మళ్లీ అదేవాదనా నడుస్తావ నడువవా ? అంత కోపపడితే ఎట్లాగండి సార్ ? మరిమంచిగా పో. నాకు కోపం తెప్పించకు. ఏమిటోయి ఆపెంకెతనం వెళ్లిపో.

వాడు ఎంతసేపటికి పాఠం పోతుందండీ. అని పెంకె జవాబులు చెపడం సాగించాడు. క్లాసులో కుర్రాళ్లు నవ్వు తున్నారు. నేను పెద్ద గొంతుకతో అధికారాన్ని అందులో పొదిగి ' వెళ్లిపోతావా గెంటించమంటావా ' అన్నా. అప్ప

టికి అసురాగ్రిడు నన్ను ఉరిమిచూస్తూ గుమ్మంఅవతల నుంచు న్నాడు. 'అక్కడనుంచుంన్నావేం మళ్లీ వెళ్లక ' అన్నాను. 'ఇక్కడనుంచోకూడదండి ' అన్నాడు. క్లాసంతా గొల్లున నవ్వాది, నేను గుమ్మంలోకివెళ్లి పెద్దగొంతెత్తి అరవాలసి వచ్చింది. వాడు వెళ్లుతూ క్లాసులోఉన్న కురగ్రివాళ్లతో ఓరే సుబ్బిగా వెళ్లుతున్నారో—నరసూ, వెడతా—ఒరో జాన్ పోతున్నారా—అని పేరుపేరునపిలిచి తాను వెడుతున్న సంగతి వాళ్లతో చెప్పటమే కాకుండా వకమేక వరండాలో తిరుగుతుం టే దాన్నిచూపి (సాధారణంగా మేకలు తిరుగుతూ అక్కడ విశ్రమిస్తూఉంటవి) మాస్టారూ! ఇదిజీతం కట్టకుండా బేరు వ్రాయించుకోకుండా వస్తున్నదీ అనిపోయినాడు. ఆకోపం మీద ఆమేకనుకూడా తరిమించేసి మరీ పాఠంచెప్పాను.

'' జీతంకట్టనివాళ్లను క్లాసులోకి రానీయకూడదు ' అనే ఆజ్ఞకు మేము లోబడవలెనన్న సంగతి వాడు తెలుసుకోడు'

ఉపాధ్యాయుడు ఒకసెన్సులో చెబుతుంటే కురగ్రివాడు ఇంకోసెన్సులో అర్థంచేసుకొంటాడు. 'అనువుగానిచోట అధికుల మనరాదు. కొండయద్దమందు కొంచెమై యుండ దా' అనేపద్యంలో రెండోపాదంలోఉన్న కొండయద్దమందు అనేవాక్యముచదివి కొండఅద్దమంటూ ఒకటి ఉంటుంది కా బోలు. కొండఎలుకలూ కొండఎలుగులు మోస్తరు కొండ అద్దాలుంటవి కాబోలు నని ఎన్నాళ్లో అనుకొనేవాడిని నామ టుకు నేను చిన్నతనంలో.

లార్డు అలిన్సుడాటరు అనేపదాన్ని సక్రమంగా బోధించిన తరువాత అందులోఉన్న I will row you over the ferry not for the silver bright, but for the winsome lady అనేవాక్యాలకు అర్థ మేమిటోయి అని కుర్రవాడిని అడిగితే కుర్రవాడు. ‘ నేను డబ్బుకోసం, ఆశపడి మిమ్ములను దాటెయ్యను, ఆపిల్లను నాకిస్తే దాటేస్తాను ’ అని పడవవాడు అన్నాడని నాకు చెప్పినాడు.

ట్యూడరు వంశంలో మేరీఅనే రాణి ఉంది. ఆరాణి తరువాత రాజ్యానికి ఎవరు వచ్చారు అన్న ఉద్దేశంతో ‘ Who followed Mary ’ అని పిల్లవాడిని అడిగితే వాడు Her little lamb Sir అనిజవాబుయిస్తాడు , Mary and her lamb ’ అనే పద్యాన్ని జ్ఞాపకంతెచ్చుకొని.

ఒకమారు నేను పాఠంచెబుతూ ‘ అపాయమునుండి తప్పించుకొనుట ’ అనే విషయాన్నిగురించి బోధిస్తూ నేను వకమాటు అపాయమునుండి తప్పించుకొనినకథనుగురించి చెప్ప మొదలుపెట్టాను. మేము కొందరం కొండవీడు చూడటంనిమిత్తం వెళ్లి ఆపురాతనమై శిథిలమైన ఆకోటనూ, ఆనాశనాన్ని అదేపనిగా చూస్తున్న ఆకోటబురుజులనూ పూర్వపురాజులు ఉపయోగించిన ధనపుకొట్లూ ఏనుగశాలలూ వెదుళ్లచెరువూ మొదలైనవానివిషయమై చెప్పి ఆవెదుళ్లచెరువులో స్నానాకిని దిగి బాగారాకపోయినా ఈదుతూ కొంచెము లోతునీళ్లలోకివెళ్లి ఇంకేముంద్రి—చావటానికి సిద్ధమైనాను అనేసరికి , చచ్చిపోయి

నారండీ మాస్టారూ' అన్నాడు వక కుర్రివాడు దీనవదనంతో అట్లా అప్రియత్నంగా వాడి నోటవెంట వచ్చినమాటకు క్లాసం తావిరగబడి నవ్వింది. వెంటనే ఆకుర్రివాడు తన తెలివితక్కువతనానికి సిగ్గుపడీ నవ్వి ఊరుకొన్నాడు.

అదీ వక అదృష్టమే. పూర్వము బిక్కర్స్టాప్ అనే ఆయన ఇంకొక పెద్దమనిషితో నీవు ఫలానిరోజున పరలోకగతుడవు కాగలవు. నీజాతకఫలం అలాఉందని చెప్పాడు. ఆపెద్దమనిషికూడా జ్యోతిషం తెలిసినవాడే. ఆయన నేను ఆరోజుకు చావనని శాదించాడు. ఈఇద్దరు పండితులలో ఎవరు గెలుస్తారో అని పట్టణంఅంతా ఉడికిపోతున్నారు. సరే అనుకున్నరోజువచ్చింది. ఒకవేళ చస్తానేమోనని ఆపెద్దమనిషికి అనుమానంకలిగి అయినా చూద్దామని వరండాలో కుర్చీవేసుకొని కూర్చున్నాడు. ఆయనపేరు పాట్రిడ్జి. సరిగ్గా ఆగంటవచ్చింది. చావురాలేదు. సరిగ్గా ఆనిమిషమువచ్చింది. చావలేదు. పాట్రిడ్జి తనకు చావురాలేదని సంతోషించి లేచాడు. ఇంతలో ఎవరో ఇంటిముందు చావుగంటకొట్టుతూ వస్తున్నాడు. ఇతడు కిటికిలోనుంచి తొంగిచూచి 'ఎవరుచచ్చినారు' అని అడిగితే పాట్రిడ్జిగారు చనిపోయినారండీ' అని జవాబువచ్చింది. నేను బతికే ఉన్నానురా అని ఎంత మొత్తుకున్నా వినకుండ వాడు గంటకొట్టుకుంటూ వీధివెంట పోయినాడు.

ఇంకాకొంచెంసేపటికి వాళ్లవాకిటముందునుంచి వాన్ని పెట్టెలోపెట్టి తీసుకొనివెళ్లారు. ఎవరయ్యా పోయింది అని

అంటే పాట్రిడ్జిగారు అనేజవాబు వచ్చింది. ఈవిధంగా ఆయ నకు జరుగవలసిన ఉత్తరక్రియలన్నీ జరిగినవి.

పాట్రిడ్జి ఒకవీధినిబడి, నేను బతికిఉన్నానరో‍్రో' అని కేకలువేయటం మొదలుపెట్టాడు. అప్పుడు బికర్‌స్టాఫ్ ఆవీ ధులవెంట తిరిగేవ్యక్తి పాట్రిడ్జియొక్క భౌతికశరీరంకాదనీ, అతని స్పిరిట్ అనీ వాదింప సాగించాడు. అతడు బ్రతికి ఉన్నా ఇట్లాఅందరూ అతనిని చచ్చినవాళ్లలో లెక్కవేశారట. మాకుర్రవాళ్లు ఇంతటితో పోనివ్వటం నాఅదృష్టమేకదా అను కొన్నాను.

మేము ఒకవిధంగా చెబితే వాళ్లకు ఇంకోవిధంగాఅర్థం అవుతుదన్నవిషయంలో నేను ఇంకా చెప్పవలసినది ఏమి లేదు. కుర్రవాళ్ళు యిచ్చిన ఈక్రిందిజవాబులు ఈవిషయాన్నే బలప రుస్తవని ఉదహరిస్తున్నాను.

(1) వనమాలి అంటే వనంలోదొరికే ఒకవిధమైనమూలిక. (2) జార్జి IV గురించి వ్రాయుమన్న ప్రశ్నకు జబాబుగా ఈ యనఒకరకం విస్కీ కనిపెట్టినాడు. దానినే జార్జి IV విస్కీ అంటారు. (3) శృంగార నైషధమను కావ్యయును శృంగా రుడు నైషధుడు అనే ఇద్దరుకవులు వ్రాయటంచేత దానికి ఆపేరు కలిగింది.

BC

వక్రరేఖ

( చరిత్రాత్మకమైన నవల )

శ్రీ మునిమాణిక్యం

◆ ◆ ◆ ◆ ◆

నేనూ — మాకాంతం

( కథాసంపుటి )

శ్రీ మునిమాణిక్యం

◆ ◆ ◆ ◆ ◆

పద్మావతీ చరణచారణ చక్రవర్తి.

( పద్యనాటిక )

శ్రీ శివశంకరశాస్త్రి

◆ ◆ ◆ ◆ ◆

తల్లావజ్ఝలవారు గ్రంథ ప్రకాశకులు. గుంటూరు.

| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPKA 104 B182 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 26-10-24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 81 |
| పెద్ద సైజు పేజీలు | నిల్ |
| ఖాళీ పేజీలు | Ci-74, BCi |
| లేని పేజీలు | నిల్ |
| తయారు చేసినది | kasimbi |
| పేజీలు విడదీసినది | kasimbi |
| స్కాన్ చేసినది | prathyusha |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | నిల్ |
| పరిస్థితి | Good |